ఇంటిల్లిపాదీ చూడవలసిన గృహసమస్యా చిత్రం

జనవరి 9 విడుదల

*అన్యం పుణ్యం ఎరుగని అమాయకుడు*
*ఒక ఆడదాని వలలో చిక్కిపోయి తన*
*ఆలుబిడ్డలకు దూరమైపోయాడు*



నాగయ్య..లింగమూర్తి
రామశర్మ..దొరస్వామి
రాజకుమారి..విద్య
గిరిజ..ఛాయాదేవి
*నటించిన*

అమరిండియా
*వారి*

# నాయిల్లు

*డైరెక్షన్*... నాగయ్య..



*రచన*.. దేవులపల్లి. యడవల్లి.
*సంగీతం*. నాగయ్య. అద్దేపల్లి.
*నృత్యం*. వెంపటి.
*కెమెరా*. రహమాన్..

*స్టూడియోస్*.
వాహినీ. రేవతి.




భాస్కర్ ప్రొడక్షన్సు చిత్రం

# బ్రతుకు తెరువు

డైరెక్షన్
రామకృష్ణ



డిస్ట్రిబ్యూటర్సు:

ఆంధ్ర : ప్రిమియర్ ఫిలిమ్స్, సీడెడ్ : నవయుగఫిలిమ్స్, నైజామ్సు : ప్రిమియర్ పిక్చర్స్.

మైసూరు : చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు,

వివరములకు : భాస్కర్ ప్రొడక్షన్సు, మద్రాసు-17.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

GRIHALAKSHMI

సంపుటము ౨౨]　　జనవరి 1953　　[సంచిక ౧







# వి ష య సూ చి క





సంక్రాంతి సంబరం




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

## స్వ వి ష యం

కొన్ని అవాంతరములు ఏర్పడినప్పటికి దీనిని సంక్రాంతి సంచికగా వెలువడ చేయడానికి భగవంతుని అనుగ్రహం అపారంగా తోడ్పడింది.

సంక్రాంతి, నూతన సంవత్సరాలతో బాటు మా గృహలక్ష్మి 22 వ సంపుటం ప్రారంభమగుతున్నది. ఈ సందర్భంలో మా పాఠకులను, రచయితలను, రచయిత్రులను హృదయపూర్వకంగా నభినందిస్తున్నాము. మీ అపారఅభిమాన సహకారములతో మా పత్రికను యింకా ఉత్సాహంగా, సర్వాంగసుందరంగా, ఆకర్షణీయంగా మీ కందచెయ్యడానికి ప్రయత్నిస్తాము.

మహిళాభ్యున్నతికి ముఖ్యంగా మాపత్రిక ఎల్లప్పుడు కృషిచేస్తుంది. దాంతో బాటు విజ్ఞానవికాసాలకు, వినోదానికి ఉపయుక్తమయిన వివిధ శీర్షికలు మా పత్రికలో వెలువడుతవి. ఈసందర్భంలో మీ అందరి ఆదరాభిమానములతో మాపత్రిక యింకా అనేక సంవత్సరాలు మహిళాలోకానికి సేవచేయగలదు.

# ఆంధ్రరాష్ట్రసిద్ధి



ఆంధ్రరాష్ట్రం సిద్ధించబోతున్న యీ సమయంలోనైనా ఆంధ్రప్రజానీకం తమ హక్కులను, అవకాశములను బాగుగా అర్థంచేసికొని తమకు అన్యాయం జరుగకుండా చూచుకోవాలి.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సందర్భంలో అరవసోదరులు హర్షిస్తారని అనుకోడం పెద్ద పొరబాటు. పైకి సంతోషం వెల్లడించినా లోలోనమాత్రం వీలయితే రాష్ట్రనిర్మాణం వాయిదా పడాలనిమాత్రం వాళ్ల కోరిక. ఇందులో వాళ్లస్వార్థం చాలాయున్నది.

ఈ సందర్భములో ఆంధ్రులకు వాదోపవాదాలుకాదు ముఖ్యం—తమ పనిని న్యాయంగా నిర్వహించుకోకలుగడం కార్యశూరత్వమనిపించుకొంటుంది. రాజకీయాభిప్రాయాలనుబట్టి తాము విడివిడిగా ఏపార్టీకిచెందినా ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్య విషయంలోమాత్రం అందరు ఏకమయి తమ రాష్ట్రపురోభివృద్ధికి ఉపకరించే లాంటి కార్యక్రమాన్ని ఆచరణలోపెట్టాలి. దీనికి ప్రస్తుతము దక్షిణాదిలోని అరవ వారి సంఘీభావము ఆంధ్రులకు కనువిప్పుకావాలి.

ఆంధ్రరాష్ట్ర రాజధానిని గురించి విభిన్నాభిప్రాయాలు చాల అసహ్యముగా నున్నవి. శ్రీ వాంచూగారు బయలుదేరివస్తూండగా దారిలో ఆంధ్రదేశ వివిధప్రాంత్యాలు సమర్పించిన నివేదికలలో ప్రతిప్రాంత్యపువారు తమ పట్టణం రాజధాని కావాలని సూచించారు. ఈయభిప్రాయాలనుచూచి శ్రీ వాంఛూ ఏమనుకొనియుంటాడో ఆలోచించండి.

ఆంధ్రరాష్ట్రానికి రాజధాని ఎలాగుండాలి? సర్వప్రజానీకానికి అందుబాటులో నుండాలి. రాష్ట్రంయొక్క ఆర్థికవ్యాపారముల అభివృద్ధికి ఉపకరించేలాగ; సముద్ర ప్రాంత్యంగా నుండటం ఉత్తమం. నగరం విస్తరించడానికి అనువైన ప్రదేశమయి యుండాలి. వీనిని దృష్టిలో నుంచుకొని అందరు ఏకకంఠముతో రాజధాని నగరాన్ని సూచించడం తెలివైనపని. అలా కాకుండా ఎవరిమటుకువారు తమ పట్టణం రాజధాని నగరంకావాలని పగటికలలు కనడం హాస్యాస్పదం.

ఇక మద్రాసు నగరసమస్యచూద్దామంటే వీలయినంతవరకు తెలుగువాళ్లకు ఏమాత్రము అవకాశం దక్కనీయకుండాచేయాలని అరవలు ఆర్భాటంచేస్తుంటే తెలుగువాళ్లలోనే కొందరు మద్రాసు నగరంతో పనిలేకుండానే బెజవాడను రాజధానిగాచేసి ఆంధ్రరాష్ట్రం నిర్మించమనికోరుతున్నారు.

మద్రాసు నగరభవిష్యత్తును గురించి మాట్లాడే హక్కును ప్రధానంగా స్థానికంగా నివసిస్తూయుండి, నగరనిర్మాణంలోను, నగరంలోని వర్తకవ్యాపార అభివృద్ధులకుతోడ్పడి యీనాటి నగరమహోన్నతస్థితికి తెచ్చిన తెలుగువారికి వదలాలి. వారి ఉద్యమానికి సహాయపడటానికికాను యావదాంధ్రదేశం ముందుకురావాలి. నగరంలోని ఆంధ్రులు

తమభాష, సంస్కృతి, అభివృద్ధుల దృష్ట్యా ఆంధ్రరాష్ట్రముతో చేర నుత్సాహపడ తారు. వారి న్యాయమైనవాంఛను ఆంధ్రులు గుర్తించి వారి ఉద్యమానికి ప్రోత్సాహ మివ్వవలసిన బాధ్యత ఆంధ్రప్రజానీకంమీదనున్నది. ఇది ఉభయుల శ్రేయస్సుకు పునాది యన్నమాట. అలాకాకుండా మద్రాసునగరంలోని ఆంధ్రప్రజానీకాన్ని నిర్లక్ష్యముచేస్తే నష్టపడేది నగరంలోని తెలుగువారు మాత్రంకారు—యావదాంధ్ర దేశంకూడాను.

చారిత్రాత్మకంగా మద్రాసునగరంపై తెలుగువారికిగల హక్కులు న్యాయ సమ్మతమయినవి.

మొట్టమొదటినుండి నివసిస్తూ వర్తకవ్యాపారములను నిర్వహిస్తూ యీనగర ప్రస్తుతస్థితికి సర్వవిధాల తోడ్పడినవారు తెలుగువారు. కాని దరిమలా ఉద్యోగాలకని, వృత్తులకని తమిళులు, కన్నడులు మొదలైనవారువచ్చారు. వాళ్లు తెలుగువాళ్ల తోబాటు నివసిస్తున్నారు. ఉద్యోగాలకని, నౌకర్లకని అరవలువచ్చినంతమంది తెలుగు వారు దరిమలా యిళ్లువాకిళ్లు వదలిపెట్టి మద్రాసుకు చేరుకోకపోవడంచేత తమిళులు మొదలగు వారిసంఖ్య ప్రబలింది. అయినా యీనాడు తెలుగుజనాభా యించుమించుగా అరవలతో సమానంగానే యున్నదను విషయం నిర్వివాదాంశము. అయినా నేడు తెలుగువారితోబాటు తమిళులు, కన్నడులు, మలయాళీలు మొదలైనవారు నివసిస్తు న్నారు. కాబట్టి సమానహక్కులు, అవకాశాల దృష్ట్యా చీఫ్‌కమీషనర్ రాష్ట్రంగా చేస్తే అందరికి న్యాయంకలుగుతుంది. ఈకోర్కె ఆంధ్రులు తమకు మద్రాసుపై హక్కు బలహీనమయినదయినందున కోరుచున్నదికాదు. నగరంలోని సర్వప్రజానీకపు శ్రేయస్సు, ఐకమత్యము, సోదరభావముల దృష్ట్యాకోరుచున్నది. ఇది అరవలకు సమ్మతి కాకపోవడం అఘాయిత్యమనిపించుకొంటుంది.

ఇక నగరభవిష్యత్తును నిర్ణయించడం మద్రాసునగరంలోని తెలుగువారిపై బడింది. మొదట తాము తెలుగువారిమని గుర్తించుకోవాలి. అందుకుగాను వ్యక్తిత్వ మునకు, ఆత్మగౌరవమునకు లోపములేకుండా వ్యవహరించిననాడేగాని సాధ్యంకాదు. నగరంలోని వివిధప్రాంత్యములలోని తెలుగువారు తమ జనాభాను నిరూపించుకోకలుగ డానికి అవసరమయిన లెఖ్కలను తయారుచేసికోవాలి. దాంతోబాటు ఉత్తరహిందూ స్థానీయులను, మలయాళీలను, కన్నడులను, మొదలగు వారి సహాయసహకార ములను సమీకరించి మహత్తరమయిన ఉద్యమాన్ని మద్రాసు చీఫ్‌కమీషనర్ రాష్ట్రంగా ఏర్పడేవరకు సాగించాలి. ఆనాడుగాని ఆంధ్రవాంఛితమైన న్యాయమైన హక్కులు సాధించబడవు.

చీఫ్‌కమీషనర్ రాష్ట్రమయిన మద్రాసులో ఆంధ్రరాష్ట్ర రాజధానియుండు టకు కూడ ఆటంకాలుండవు.

---

# హాతింతాయి కథలు

శ్రీ ఓరుమళ్ల కామేశ్వరరావుగారు

పూర్వకాలంలో గొప్పగొప్ప వీరులుండే వారు. వారిని గురించి కవులు పద్యాలు, పాటలు, గ్రంథాలు రాశారు. రాముడనే మహావీరుణ్ణి గురించి వాల్మీకి మహాకవి రాసిన గ్రంథమే రామాయణం. పాండవ రాజులయొక్క ఘనతను వర్ణిస్తూ వ్యాస మహాకవి రాసిన కావ్యమే మహాభారతం. అదేమాదిరిగా పాశ్చాత్య దేశమైన గ్రీసులో హోమరు మహాకవి అప్పటి వీరులను గురించి ఇలియడు, ఒడిస్సి అను ఘన పురాణాలను రాశాడు. ఈవీరులందరు ఉట్టి పుక్కిటిపురాణ వ్యక్తులని మాత్రం అనుకోకండి. ఆమహానుభావులు నిజంగా ఒకప్పుడు ఉండేవారు. కాని వారిని గురించి కొన్ని అభూతకల్పనలు కూడ బయలు దేరాయి. ఆకల్పనలు అబద్ధం కాని వారు మట్టుకు నిజంగా జీవించినవారే! పురాతత్వ పరిశోధనవల్ల కొందరు పూర్వుల చరిత్రాంశాలు కొన్ని బయలుపడుతూం టాయి. హోమరు మహాకవి రాసిన కొందరు వీరుల చరిత్ర ఈమధ్య ఏలాగు బయట పడిందో చూడండి. గ్రీకులో మైసీన్ అనే చోట కొన్నిపాతగోరీలు బైటపడ్డాయి. ఇవి మూడువేల ఏళ్లక్రిందటివి. ఇక్కడ అస్థిపంజరాలు, బంగారు నగలు, పలకలు దొరికేయి. చాలా విచిత్రమైన ఒకవిషయ మేమిటంటే ఒకవీరుడు గుర్రం మీద స్వారి చేస్తూన్న శిల్ప మొకటి దొరికింది. [Excavations at Myceane, 'The Hindu' 20-7-1952 పుట 7, కాలం 8.]

మహా వీరులు అన్ని కాలాలలోను జన్మి స్తారు. కిందటి శతాబ్దంలో డొక్కా జోగమ్మ అనే గొప్ప అన్నదాత కరువు కాలంలో తెలుగు ప్రజలకు అన్నదానం చేసి ప్రాణాలు రక్షించగా ఆమెపేర పాటలు, పద్యాలు వెలిసేయి. 1920 ప్రాంతాలలో ఆంధ్రదేశంలో అల్లూరి సీతారామ రాజు అనే మహానుభావుడు బ్రిటిష్ గవర్నమెంటుమీద స్వాతంత్ర్య యుద్ధం ప్రకటించి శాశ్వత కీర్తిని గడించేడు. అన్ని దేశాలలోను ఇటువంటి మహావీరులున్నారు. ఇంగ్లాండులో రాబిన్‌హుడ్ అనే వీరుడు బయలుదేరి ధనవంతులను దోచి దరిద్రులను పోషించేడు. అతనిమీద పాటలు, పద్యాలు వెలిసేయి.

పూర్వకాలంలో అరేబియా దేశంలో మహావీరులుండేవారు. వారిలో ముఖ్యులైన వారిద్దరు; హాతింతాయి ఒకడు, హాతిమ్ బిన్‌సినాన్ ఇంకొకడు (A literary History of the Arabs by Reynolds A Nicholson పుట 288.) వీరు మహమ్మదు ప్రవక్తకంటె పూర్వం జన్మించినవారు. దీనిని బట్టి వీరు ఎంతటి ప్రాచీనులో ఊహించండి. ఇప్పుడు హాతింతాయిని గురించి తెలుసుకొందాం.

హాతింతాయి జన్మించిన అరేబియా దేశమెటువంటిదో మీరు భూగోళ శాస్త్రంలో చదువుకొనే ఉన్నారు. అది ఒక ఎడారి అంటే, ఇసుక ప్రదేశం. అక్కడక్కడ కొండలుకూడా ఉన్నాయి. అక్కడి ప్రజలు ఒంటెలను పెంచుతారు. అవే వాళ్లకి సమస్తమున్నూ. ఒకమనిషి ఆస్తి తెలుసుకోవాలంటే అతనికి ఉండే ఒంటెలసంఖ్య తెలుసుకొంటేచాలు. ఇప్పటికీ విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో పశువులకు సామ్ములని పేరు. పూర్వకాలంలో ఒకమనిషికి ఉండే ఆస్తి అంతా అతని పశువులే! కాబట్టి నాటికి సామ్ములు అనిపేరు వచ్చింది. పరిస్థితులు మారినా ఇప్పటికీ ఆపేరు అలాగే నిల్చిపోయింది.

హాతింతాయి కొన్ని వందల ఏళ్లక్రిందట జన్మించేడు. ఆ మహానుభావుడు శూరత్వం వల్ల, దానధర్మాలవల్ల పేరుపొందేడు. ఆయన ఎంతటి గొప్పపేరు పొందేడంటే, ఆతర్వాత ఆచుట్టుపట్ల దేశాలను పరిపాలించిన రాజులందరు తాము రెండవ హాతిమ్ములము అని అనిపించుకోవడానికి ఎంతో తంటాలు పడేవారు. హిందూదేశంలో భారతకాలంలో కర్ణుడు మహాశూరుడు, గొప్పదాత. ఆయనికి దానకర్ణుడని పేరు. ఇప్పటికీ అనేకమంది దానధర్మాలుచేసి తాము దానకర్ణుల మనిపించుకోడానికి ఉవ్విళ్లూరడం లేదా? అదే మోస్తరుగా ఆకాలంలో అరేబియా, పర్షియా మొదలైన దేశాలలో రాజులు కూడా! దీనిని బట్టి హాతిం ఘనతను గుర్తించండి. ఆ మహావీరుణ్ణి దానపరుణ్ణి గురించి అనేక కథలు, పాటలు నాటినుండి వెలిసేయి. అంతేకాదు అనేకమంది కవులు తమ కావ్యాలలో ఆయనను వర్ణించి ఆనందించేరు. హాతిం అంతటి జనతా వీరుడు (Popular Hero)

హాతిం ఒకకల్పనా పురుషుడుగాక నిజంగా ఉండే వాడని ఇదివరకే చెప్పాను. అతను మహమ్మదు ప్రవర్తకు పూర్వముండే వాడని చెప్పవచ్చు. క్రీ. శ. ఏడవశతాబ్దం ప్రథమ భాగంలో మహమ్మదు ప్రవక్త మహానుభావుడయేడని మీరెరుగుదురు.

హాతింతాయి అనేది రెండు మాటల సంపుటి. హాతిం అనేది అతనిపేరు; తాయి అనేది అతనితెగపేరు. అరేబియా దేశంలో అనేక చిన్న చిన్న తెగలుండేవి. వాటిలో తయ్యి అనేది ఒకతెగ. ఆతెగకి చెందినవాడు హాతిం. ఈ 'తయ్యి' మాట క్రమంగా 'తాయి' అయింది. ప్రజలు అతన్ని హాతింతాయి అన్నారు.

హాతింతాయిని గురించి ఉండేకథలు మీలో కొందరు చదివే ఉంటారు. ఇతని పేరున సినీమా ఫిల్ముకూడా ఉంది. దానిని మీలో కొందరు చూసివుండవచ్చు. ఈ ప్రసిద్ధపురుషుని జీవిత విశేషాలను కొన్నిటిని ఇక్కడ తెలియజేస్తాను.

హాతిం తల్లికి ఒకరోజున ఒకకలవచ్చింది. ఆకలలో 'నీకు త్యాగమూర్తియైన హాతిం

అని కొడుకు కావాలా లేక ధైర్యశాలి అయిన పుత్రుడు కావాలా?' అని ప్రశ్న. 'నాకు హాతిం కావాలి' అంది తల్లి. ఇదీ హాతిం జన్మ (A literary History of the Arabs పుట 85.) హాతిం పెద్దవాడయ్యేక ఇతరులకు పెట్టకుండా భోంచేసేవాడు కాదు.

ఒకనాడు తండ్రి తన ఆస్తియైన ఒంటెలను కాయమని హాతింకు అప్పగించేడు. అతను కాస్తూ తోడివాళ్లకోసం వెతికేడు. ఎవరూ కనబడలేదు. రోడ్డుమీద వచ్చే బాటసారులను ఆపి మూడు ఒంటెలను విందు చేశాడు. వాళ్లు ఎంతో సంతోషించేరు. అతన్ని గురించి పాటలు పాడేరు. హాతిం పొంగిపోయి ఒంటెల నన్నింటిని వాళ్లకి పంచిపెట్టివేశాడు ఈవిషయం తెలిసి అతని తండ్రి అతన్ని ఇంటినుంచి పంపించి వేశాడు. (A literary History of the Arabs పుటలు 85-87)

హాతింతాయిని గురించి The Encyclopedia of Islam అనే గ్రంథంలోని కొన్ని అంశాలను ఇక్కడ ఉదహరిస్తాను చూడండి. మహమ్మద్ ప్రవక్తకి కొంచెం ముందుగా కిరుడు, ప్రవక్తయైన హాదేం ఉండేవాడు. అతడు అల్‌నబిఘు, బిషర్‌బి, అబిఖాజిమ్, అబిడ్ బి అల్ అబ్రస్ అనే కవులకు సమకాలికుడు. హాతిం తన అవసరాలను ఏ మాత్రమూ గణించకుండ అతిథి సత్కారము, దానధర్మాలు అపూర్వంగా చేసేవాడు. ఈ గుణాలు అతని యౌవ్వన కాలమందే ఉండేవి. చిన్ననాడే హాతిం తండ్రి గతించేడు. అతని తాత పెంచేవాడు. కాని హాతింయొక్క అమితదాన గుణానికి తట్టుకోలేక అతన్ని విడిచిపెట్టివేశాడు. తర్వాత హాతిం స్వతంత్రంగా జీవయాత్ర చేశాడు. మహమ్మద్‌కు పూర్వ కాలమందు హాతిం ఆదర్శ వ్యక్తిగా పేరు పొందేడు.

అతని దానగుణం లోకోక్తిగా ఏర్పడింది. అతన్ని ప్రజలు అల్‌జ్జావద్ అని లేక అల్ అద్‌జ్వద్ అని పిలిచేవారు. హాతిం మరణించిన తర్వాతకూడ అతని గోరీవద్ద మొక్కుకొన్నవారి మొక్కులు నెరవేర్చేవాడు. అతని గోరీ వాది హైల్ అనే ప్రదేశంలో 'తుంగ' వద్ద ఉండే కొండమీద ఉంది. ఆ పరిసరాలలోనే అతను నివసించి ఉండవచ్చు. అల్ మసూది అనే గ్రంథంలో ఈ క్రింది సంగతి తెలుపబడింది. అతని గోరీకి ఎడమవైపున అతనికోసం దుఃఖిస్తూన్నట్లుగా తలలు విరియబోసు కొన్న నాలుగు స్త్రీ విగ్రహాలుండేవి. ఆ గోరీదగ్గరే హాతిం అతిథులకు వడ్డిస్తూన్న ఒక పెద్ద కెటిల్ యొక్క భాగాలుకూడ ఉండేవి. ఇప్పటికీ ఆ జిల్లాలో హాతింయొక్క గోరీని చూపిస్తూంటారు (The Encyclo pedia of Islam)

హాతింతాయిని గురించి అనేకమంది కవులు రాశారు. చార్ దర్వీషు అనే

గ్రంథంలో రాయబడిన అంశాన్ని ఇక్కడ తెలియజేస్తాను.

చార్ దర్వేష్‌ను అమీర్‌ఖుస్రూ అనే పారసీకకవి రాశాడు. ఇది ఇంగ్లీషులోకి అనువదించబడింది. దానినిబట్టి తెలుగున రచింపబడింది. చార్ దర్వేషు అను తెలుగు పుస్తకాన్ని వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్, మదరాసువారు ప్రకటించేరుటీ. కా. దానిలో రెండో ఫకీరు చెప్పిన కథలో హాతింతాయియొక్క అపూర్వ త్యాగబుద్ధి ప్రశంసింపబడింది. దానిని క్రింద తెలియజేస్తున్నాను.

హాతింతాయి కాలంలో అరబ్బీ దేశాన్ని నౌఫల్ అనే రాజు పాలించేవాడు. అతను హాతిం పేరు ప్రతిష్ఠలువిని ఓర్వలేక గొప్ప సైన్యాన్ని తీసుకొని హాతింమీదికి దాడి వెడలేడు. అది చూసి హాతిం, యుద్ధం వల్ల ప్రజలు నాశనమవుతారని విచారించి శత్రువుని ఎదుర్కొనక ఒక కొండ గుహలో దాగుకొన్నాడు. హాతింయొక్క రాజ్యము, ఆస్తి అంతాకూడ నౌఫల్ స్వాధీనం చేసుకొన్నాడు. కాని నౌఫల్‌కి తృప్తిలేదు. హాతింనుపట్టి అప్పగించినవారికి అయిదు వేల మొహిరీలు బహుమానం చేస్తానని ప్రకటించేడు.

ఒక రోజున ఒక ముసలివాడు పెళ్ళాము బిడ్డలను వెంటపెట్టుకొని కట్టెలు కొట్టితెచ్చుకోడానికి వెళ్ళేడు. గుహదగ్గరే ముసలివాడు కట్టెలు కొడుతూండగా, వాడిభార్య వాటిని పోగుచేస్తూ, భర్తతో "మన అదృష్టం బాగుంటె మనకి హాతిం ఎక్కడైనా కనిపిస్తాడు. మనం అతన్ని రాజుకి అప్పగిస్తే బోలెడంత డబ్బు వస్తుంది. మనం, మన పిల్లలు ఏ ఇబ్బంది లేకుండా బ్రతకవచ్చు" అంది. అందుకు ముసలివాడు "మన నుదుటిరాత ఈలాగుండగా ఆ మోస్తరుగా ఏలాగు జరుగుతుంది!" అని నిట్టూర్చేడు. ముసలిది విచారించింది. ఈ సంభాషణంతా గుహలోఉన్న హాతిం చెవ్వల బడింది. అతను తనలో "నేను నా ప్రాణాలను రక్షించుకోడంవల్ల ఏమిప్రయోజనం? ఈ ముసలివాళ్లని సుఖపెట్టకపోయేక నా బ్రతుకెందుకు? నా గౌరవ మెందుకు? ఇతరులను సుఖపెట్టడంకోసం దేవుడు మనుష్యుణ్ణి సృష్టించేడు. అంతేకాని మనుష్యుడు తాను సుఖపడడంకోసంకాదు" అని ఆలోచించి, ముసలివాడి దగ్గరికి వెళ్లి "అబ్బాయీ! నేనే హాతింను, నన్ను నౌఫల్ దగ్గరికి తీసుకుపోయి డబ్బు సంపాదించుకో!" అన్నాడు. అదివిని ఆ ముసలి దంపతులు ఆశ్చర్యపోయేరు. కాని ముసలివాడు "ఓహాతిమూ! నీ వంటి మహానుభావుడు మరొకడుండబోడు. నిన్ను నౌఫల్ దగ్గరకు తీసుకువెళ్లగా, ఒక వేళ అతను నిన్ను చంపివేస్తే నేనేమి చెయ్యను! కనుక నిన్ను నేనై నౌఫల్ దగ్గరకి తీసుకు వెళ్లను" అన్నాడు. అందుకు హాతిం "ఒరే అబ్బీ! నేను చెప్పినట్లుగా నువ్వు చెయ్యకపోతే

నేనేమి చేస్తానో తెలుసా? నౌఫల్ దగ్గరకి నేనే వెళ్ళి 'ఇంతకాలమూ ఈ ముసలివాడే నన్ను దాచి ఉంచేడు' అని చెప్తాను" అని ముసలివాణ్ణి బెదరకొట్టేడు. "కథ అడ్డం తిరిగిందే!" అని ముసలివాడు కంగారు పడ్డాడు. ఇంతలో కొందరు దుండగీళ్లు హాతింను చూసి పట్టి నౌఫల్ దగ్గరకి తీసుకు వెళ్లేరు. ముసలివాడుకూడ వెంట వెళ్ళేడు.

దుండగీళ్లు నౌఫల్‌తో "మేమే హాతింను కనుక్కొన్నా"మని చెప్పేరు. "అది నిజమేనా?" అని నౌఫల్ హాతింను అడిగేడు. దానికి హాతెం చిరునవ్వునవ్వి "ఆ ముసలివాణ్ణి అడుగు" అన్నాడు. ముసలివాడు పూసగుచ్చినట్లుగా అంతా తెలియజేశాడు. నౌఫల్ ఆశ్చర్యపోయేడు. "ఓ హాతిమూ! నీ ప్రాణాలనైనా అర్పించి యాచకులను రక్షించే నీకు ఈ భూమిలో సాటి ఎవ్వరు! నీ రాజ్యం నాకక్కరలేదు. నీకే తిరిగి ఇచ్చివేస్తాను" అని హాతింకు రాజ్యం ఇచ్చివేసి మళ్ళీ పట్టాభిషేకం చేశాడు. ముసలివాడికి అయిదువేల మొహరీలు ఇచ్చేడు. హాతింయొక్క దాన ధర్మాలు ఎంత అద్భుతమైనవో గమనించేరా!

హాతింకు ఒక కుమార్తె ఉండేది. ఆమెను మహమ్మదు ప్రవక్త వద్దకు బందీగా తీసుకుపోయేరు. అప్పుడామె మహమ్మదు ప్రవక్తతో "నాతండ్రి త్యాగధనుడు. ఆయన అర్థుల కోరికలను తీర్చక ఎరగడు. కాబట్టి నీవు నన్ను చెరబట్టక విడవవలసింది" అని కోరుకొంది. ఆమె కోరిక ప్రకారం మహమ్మదు బంధ విముక్తి చేశాడు (A Literary History of the Arabs 85.87)

హాతిం తాయి శూరుడు, వీరుడు మాత్రమే గాకుండా కవికూడాను. అతను రాసిన పద్యాలు చాలవరకు దాన ధర్మాలను ప్రశంసిస్తూంటాయి. దివాన్ అనే గ్రంథం అతని పేర ఉంది. ఇది మొదట పెద్ద గ్రంథమే అయుండవచ్చు. ఇప్పుడు దీనిలో ఇతరుల పద్యాలుకూడ చేరినట్లుగా కనబడుతూంది (The Encyclopedia of Islam)

మచ్చుకి హాతిం కవిత్వం ఇంగ్లీషులోకి అనువదించబడింది. దానిని ఇక్కడ తెలుగు వచనంలోకి అనువదిస్తున్నాను. "అబ్దుల్లా యొక్క, మాలిక్ యొక్క, ఈమెన్ పదార్థంతో తయారైన రెండు దుస్తులు వేసుకొని స్వారిచేసే వీరునియొక్క ఓ కుమారీ! విను! నామట్టుకు నేను ఒంటరిగా భోంచేసేటంత అవివేకినికాను. నీవు వంటచేసిన తర్వాత అతిథినికూడా భోజనంలో పాల్గొనమనికోరు. లేకుంటే రాత్రివెళ్లే బాటసారిని కాని, అదికాకుంటే మా ఇంటి పొరుగు మనిషినికాని భోజనానికి పిలువు. మనిషి గతించిన తర్వాత అతన్ని గురించి చెప్పుకొనే మాటలంటే నాకు పరమ అసహ్యం. నారక్తంలో దాస్య మనేది లేదు. కాని అతిథి నాచెంతనున్నంతవరకు నేను అతని దాసుణ్ణే!" (A literary History of the



(58 వ పేజి చూడుడు)

(కథానిక)

# పోయిన డబ్బు

శ్రీమతి వజ్ఝల లక్ష్మీకాంతం

సాయంత్రం 5 గంటలయింది. శారద పడక కుర్చీలో పడుక్కుని భారతి చదువుతున్నది. ఇంతలో శారద భర్త మూర్తి ఆఫీసునుంచి వచ్చాడు. శారదలేచి కాఫీ తేవడానికి వంటింటోకి వెళ్లింది.

శారద కాఫీగ్లాసుతో గదిలోకి వచ్చేసరికి మూర్తి అల్మారాముందునిల్చుని అందులోని పుస్తకాలని దేనికో కెలుకుతున్నాడు. రోజూ ఆఫీసునుండి రాగానే అతని అలవాటు ఏమిటంటే కోటు ఓ మూలకి జోళ్లు పుస్తకాలమీదకి షర్టుమరోమూలకి విసిరేసి పడకకుర్చీలో కూలబడి కాఫీకోసం నిరీక్షించడం! అంచాత ఈ నాడు అతడు తీవ్రంగా అల్మారాను చక్కబెట్టడం చూస్తే శారదకి ఆశ్చర్యం వేసింది.

"ఏమిటలా వెతుకుతున్నారు? కాఫీ చల్లారి పోతున్నాది" అంది శారద.

కాని మూర్తి ఇదేమీ వినిపించుకోలేదు. అతడు టేబిలువద్దకువెళ్లి టేబిలు సొరుగులోని వస్తువులన్నిటినీ కింద పారవేసి వాటిలోకూడా తను వెదుకుతున్న వస్తువు దొరక్కపోగా బుర్రగోక్కుంటూ నించుని "కొంపమునిగిపోయింది" అన్నాడు. శారదకి దేమీ అర్థంకాలేదు. కొంప ఎందుకుమునగాలో ఆమెకు తెలియడంలేదు. ఆమె చిన్న నవ్వు నవ్వుతూ

"అసలు సంగతేమిటో చెప్పండి" అంది కాఫీగ్లాసు టేబిలుమీద పెడుతూ. కాని మూర్తి సరిగ్గా మాట్లాడవలసిన స్థితిలో లేడు. అంచాత అతడు శారదవైపు తీక్షణంగా చూసి "ఏమిటే? నాఖర్మ నిన్న జీతంలోవచ్చిన నూరు రూపాయలనోటు కనిబించడంలేదు" అన్నాడు కుర్చీలో కూలబడుతూ.

"ఆ! నూరు రూపాయలనోటే? అయ్యో! ఎక్కడ వుంచారు?"

"కోటుజేబులోనో ఎక్కడో వుంచాను! ఇవాళ వుదయం భోంచేసేముందు, ఆ తర్వాత నీకిచ్చి దాచమందా మనుకుంటూనే మరచిపోయాను. మళ్లీ ఇప్పుడు ఇంటికి వస్తూండగా జ్ఞాపకం వచ్చింది...ఎక్కడ వుంచానో జ్ఞాపకంలేదు...ఇంతకీ ఖర్మ! పోనీకాని నువ్వయినా అడిగితీసుకోరాదూ? నువ్వు తీసుకునిదాస్తే ఇట్లా అవకపోను కదా..."

"నాకేం తెలుసు చెప్పండీ? మీరు ఇస్తే నేను దాచనా ఏమిటి."

మూర్తి వుగ్రుడై నుదుటిమీద చేత్తో కొట్టుకుంటూ "ఔనుతల్లీ, ఔను! క్షమించు నేను ఇవ్వకపోవడం నాదేతప్పు, వప్పుకుంటున్నాను" అన్నాడు.

శారద ఖిన్నురాలై అంది, "ఇవాళ ఇట్లా వున్నారేమిటి? మీకు ఎప్పుడూరాని కోపం విసుగు ఇట్లా వస్తున్న వేమిటి? తప్పు మీది అన్నానా నేను? తప్పు ఎవరిదీకాదు ఏదో పొరపాటువశాన పోయింది డబ్బు అంతే."

"ఔను! పొరపాటువశాన పోయింది, నా పొరపాటు వల్లనే పోయింది!"

"అయ్యో అలాఎందుకనుకుంటారు? నా వుద్దేశం అది కాదండీ."

"సరే! వప్పుకున్నాను. ప్రతీ నెలజీతంవచ్చిన వెంటనే అడిగితీసుకొని దాచే దానివి. ఈ నెలకూడా ఆ విధంగానే దాస్తే ఎంతబా గుండిపోను-సరే! ఇంతకీ ఖర్మ!"

శారదమాట్లాడలేదు. భర్తవిచారంలో వుండగా మాట్లాడడం అతనికి చిరాకు కలిగిస్తుందని ఆమెకు తెలుసు. అతనిమనస్సు ఈడబ్బు పోవడంవలన చాలా కలత చెందిం దని ఆమెగ్రహించింది.

చాలాసేపటివరకూ ఇద్దరూ అట్లానే మౌనంగా కూచున్నారు. చీకటి పడింది ఏడున్నర అవుతూవుండగా శారదలేచి దీపం వెలిగించి, మెల్లిగా అంది, "భోజనానికి లేవండి ఆకలిమీద వున్నారు."

మూర్తి లేస్తూ "సరేవడ్డించు ఎంత విచా రిస్తే మాత్రం ఏంలాభం?" అన్నాడు.

భోజనాలు అయాక మూర్తి తాంబూలం వేసుకుంటున్నాడు, పక్కనే శారద కూచుని వుంది.

"శారదా" అని పిల్చాడుమూర్తిమెల్లిగా. శారదతలెత్తి భర్తముఖంలోకి చూసింది. అతని ముఖంలో విచారం జాలి కనిపిస్తున్నవి. "ఏమిటండి" శారద మెల్లిగా.

"ఆ విచారంమీద సాయంత్రం క్షమేమిటి అన్నానో నిన్ను!" అన్నాడు ఆమె వేపే చూస్తూ.

శారద మెల్లగా నవ్వి "బాగుంది! ఏమిటి అనేశారుకనక! అయినా నాకు తెలియదా ఏమిటి మీ మనస్సు మనస్సులో లేదని" అన్నది.

"ఔనుకానీ నెలల్లాకష్టపడి తెచ్చుకున్న డబ్బు ఇట్లా నాశనం అయిపోయింది! ఈ నెల ఎట్లా గడవడమో బెంగగా వుంది... నూరు రూపాయిలు... అబ్బ! ఎంత సొమ్ము! ఎట్లా పోయిందో ... ఎట్లా పోయిందో",

మీరిలా బెంగపడకండి మనస్సు ఎంత పాడుచేసుకున్నా పోయినడబ్బు తిరిగిరాదు కదా, అని శారద ఓ నిముషంపాటు ఏదో ఆలోచించి టక్కున అంది "ఇదుగో! ఈ చేతి బంగారుగాజు అమ్మేయండి వీలైనప్పుడు ఎప్పుడో మరోగాజు కొందురుగాని!"

మూర్తి మెల్లిగానవ్వి నువ్విట్లా అంటావని నేననుకుంటూనే వున్నాను. సరె తర్వాత చూద్దాం అందాక 20 రూ॥ చిల్లరనోట్లు నాదగ్గర వున్నాయి. అవి అయిపోయాకా ఆలోచిద్దాం.

20 రూ॥ ఎన్నిరోజులు వస్తాయి కనక. పోనీ రిస్టువాచీ అమ్మి వేస్తేనో?

"వద్దు వద్దు! వాచీ అమ్మకండి. మళ్లీ దొరకడం కష్టం. బంగారం ఎప్పుడైనా దొరుకుతుంది."

మూర్తి పకపకానవ్వుతూ "బజారులో బంగారమే కానీ రిస్టువాచీలు దొరకవన్న సంగతి నీకెవరు చెప్పారు శారదా!" అన్నాడు.

శారదవూరుకొంది. రాత్రి 10 గంటలు అవుతూవుండగా ఇద్దరూ పడుకొన్నారు. శారదకి నిద్రరావడంలేదు. మూర్తికళ్లు మూసుకొనిపడుకొన్నాడు. శారద ఏమేమో ఆలోచిస్తున్నది. రాత్రి ఒంటిగంట అయేక శారద మెల్లిగా పిల్చింది "ఏమండీ నిద్రేనా!"

మూర్తి కదలకుండా ఇంకా అట్లానే పడుక్కొని "లేదు" అన్నాడు.

"ఇంతవరకూ మేలుకుని వున్నారా? అయ్యయ్యో మనస్సు పాడుచేసుకుంటున్నారుకదూ చెప్పండి."

"నిజమే అవును మరచిపోదామని ఎంత ప్రయత్నించినా ఆ ఆలోచనలే మనస్సును వేధిస్తూంటే ఏంచేసేది? వందరూపాయల వల్ల వచ్చే సౌఖ్యాల్నిగూర్చి వూహించుకుంటున్నాను ఇంతసేపూను! సరేకాని నువ్వు ఎందుకు ఇంకా నిద్రపోలేదూ?"

"నాకు నిద్ర రావటంలేదు. పగలల్లా ఇవాళ నిద్ర పోయాను."

"ఓ! అయితేనూ మరి నువ్వు ఇవాళ అల్లిన మేజోళ్లు రోజల్లా నిద్రపోతూనే నిద్రలోనే అల్లేవన్నమాట కదూ!"

శారదకు నవ్వు ఆగలేదు. ఆమెనవ్వుతూ "సరే ఏదోఒకటి-ఇక పడుక్కోండి" అంది.

తెల్లవారు ఝామున 5 గంటలకు వారికి నిద్రపట్టింది.

2 రోజులు గడిచాయి. ఓ నాడు రాత్రి మూర్తి భోజనంచేస్తూ వుండగా శారద

"ఆనాటినుంచి మీరు బొత్తిగా తిండి తినడమే మానివేసారు. రోజూ పిడికెడు మెతుకులుతిని లేచిపోతున్నారు." అంది.

"నాకు ఈ మధ్య ఆకలి తగ్గిపోయింది. ఇంతకీ నువ్వుకూడా చాలా తక్కువ తింటూ వున్నావు ఈ మధ్య! ఔనా శారదా?"

"నేనుతక్కువ తింటున్నానో ఎక్కువ తింటున్నానో మీరు చూచారా ఏమిటి" చెప్పండి.

మూర్తి సీరియస్‌గా ముఖం పెట్టి "చూస్తున్నాను శారదా రోజూ వంటింటి కిటికీలోంచి నీకు తెలీకుండా బయట నుంచి చూస్తున్నాను నువ్వు - ఏమాత్రం తింటున్నావో అని. నువ్వు బొత్తిగా తిండం లేదు." అన్నాడు.

శారద వప్పుకుంది. "ఔను, మీరు బెంగ పెట్టుకోడంచూచి నా మనస్సు," శారద కంఠంగద్గదికమై పోయింది.

మరరెండు రోజులు గడిచిపోయాయి. మూర్తి చాలా నీరశించి పోయాడు. శారద కూడా అట్లాగే అయ్యింది. ఇద్దరి ముఖాల్లోనూ కళలేదు. ఓనాడు సాయంత్రం

మూర్తి ఆఫీసునుంచి వచ్చాక శారద అంది "ఇదేమిటి? ఇవాళ మీరు బొత్తిగా నీరసంగా కనిపిస్తున్నారు?"

మూర్తి బట్టలు మార్చుకుంటూ "ఔను శారదా వంకరూపాయలంటే మధ్య తరగతి వారికి ఎంత విలువో తెలుస్తున్నది. నిజమే, నేను కృశిస్తున్నానేమో అనిపిస్తున్నదికూడా, అంతేకాదు ఇవాళనాకు జ్వరంవచ్చినట్లుంది" అంటూ మంచంమీద పడుకొని రగ్గు కప్పుకున్నాడు.

రాత్రి అయేసరికి మూర్తికి జ్వరంకొంచెం ఎక్కువయింది. మర్నాడు మూర్తి అన్నం తినలేదు. రోజల్లా కప్పుకాఫీ తాగి అట్లానే పడుకున్నాడు. శారద అతని పక్కనే కూచుని రోజల్లా అతనికి ఏకోపత్రిక చదివి వినిపిస్తున్నది.

సాయంత్రం 5 గంటలవుతూవుండగా వీధితలుపు ఎవరో కొడుతూ "ఓరే మూర్తీ! వేగిరం తలుపు తియ్యరా!" అనిపిలిచారు!

"శారదా చూడు నా స్నేహితుడు రామం వచ్చినట్లుంది - తలుపుతియ్య"




అన్నాడు మూర్తి.

శారదలేచింది. అవతలవ్యక్తి తలుపు ఇంకా గట్టిగా బాదుతూ మూర్తీ! 'ఓరేయ్ వెధవాయ్, టీపార్టీ ఎప్పుడు చేస్తావురా! వేగిరం తలుపుతియ్యి మంచిగమ్మత్తురా!' అని అరుస్తూన్నాడు. శారద తలుపుతీసింది.

చేతిలో పుస్తకంతోసహా రామంలోనికి వచ్చి మంచమీదవున్న మూర్తిని చూసి ఆశ్చర్యంతో "ఇదేమిట్రా ఇలాగున్నావ్! అన్నాడు. మూర్తి జరిగిన సంగతల్లా చెప్పేడు.

"ఔను మరి అంతఅజాగ్రత్తగా డబ్బును చూస్తే ఏమిటవుతుందిరా! సరేగానీ ఈ

పుస్తకం కొన్న నాకిచ్చినట్లుగా నీకు జ్ఞాపకంవున్నదిరా? ఎవరైనా పుస్తకాల్లో నోట్లు వుంచుకుంట్రూరా! వుంచుకున్నా అంత వేగిరం మరచిపోతార్రా! సరే! ఇటు చూడు" అని రామం పుస్తకాన్ని మూర్తికిస్తూ "99వ పేజీ తెరచిచూపి టీపార్టీ ఎప్పుడో చెప్పు" అన్నాడు.

రామం శారదవైపు తిరిగి "అక్కయ్యగారూ పుస్తకం నాకు ఇచ్చేడు గాబట్టి మీ డబ్బు క్షేమంగావుంది. మరొకడైతే ఈ పాటికి నూరురూపాయలు గోవిందేకదా! మీరైనా మూర్తిని శాస్త మందలించండి అజాగ్రత్తగా వుండవద్దని" అన్నాడు.

మూర్తి పుస్తకం తెరిచాడు. అందులో 100॥ రూ॥ల నోటు తళ్ళున మెరసింది. ఆ నోటుతీసి పట్టుకొని మూర్తి ఒక్కగెంతు గెంతి మంచంమీదించిలేచి నాట్యంచేయ ప్రారంభించాడు. శారద అతని చేతిలోని నోటులాక్కొని పెట్లో దాచి "వంట్లో ఇప్పుడు ఎలాగుంది" అంది. "ఎవరి వంట్లో?" అన్నాడు మూర్తిగట్టిగా నవ్వుతూ ఇంకా నాట్యం చేస్తూనే.

అయితే వేగిరండ్రస్ వేసుకోండి భరత నాట్యం చాలించి. సినిమాకి వెళ్లాలిప్పుడు. ఆలస్యంచేస్తే వప్పుకునేది లేదు, అంది శారద కోపాన్ని అభినయిస్తూ!





'అమరకవి' (తెలుగు) చిత్రంలో త్యాగరాజ భాగవతార్, రాజకుమారి.



# ప్రేమోపాయనం

**శ్రీ సహదేవ తారాదేవి**

పాత్రులు :

| | |
|---|---|
| విజయుడు | క్రాంతినాథుడు |
| అమరనాథుడు | సువర్ణగుప్తుడు |
| మహారాజు | చంద్రావళి |
| చంప | ద్వారపాలకుడు |

(గణిక చంద్రావళి ప్రాసాదం ముందరిచావిడి)

చంప:-(ఆనందోద్రేకాలతో ప్రాంగణంలోనికిచూచి చేయిచాపి) అన్నా! అన్నయ్యా (విజయా!)

విజయ:-(ఆశ్చర్యంతో అటు నిటు చూచి) ఎవరు పిల్చేవారు?

చంప:-ఇటు! ఇటు! నీచెల్లెలు చంప!

విజయ:-(తిరిగిచూచి ఒక్క ఉరుకున లోపలికి దూకి ఆనందంతో చంప రెండుచేతులు పట్టుకుని) చెల్లీ! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి నిన్ను చూడగల్గాను! నాలుగేండ్లనుంచీ ప్రతి పట్టణంలో ప్రతి పల్లెలో దేశం నలుమూలలా నీకోసం గాలిస్తున్నాను. నేడే ఈ ఊరు వచ్చి ఈప్రాసాదాల శిల్పకళా విశిష్టత్వాన్ని వీక్షిస్తూవస్తున్నాను. అదృష్టవశాత్తు నిన్ను కలుసుకున్నాను. నాతో చెప్పకుండా ఇంటినుంచి ఎందుకు వచ్చివేశావు తల్లీ!

చంప:-అన్నా! నీకుతెలుసు నేనెందుకు గృహత్యాగం చేసిందీ.

విజయ:-నాకుతెలుసు కాని లోకానికి తెలుసా! లోకాపవాద దూషితరైయిన స్త్రీ జీవితం పూలబాటకాదు.

చంప:-ప్రోషిత భర్తృక జీవితం మాత్రం కంటక సదృశంకాదా అన్నా! అందుకనే నాస్వామి నన్వేషిస్తూ ఆశాశల తిరుగుతున్నాను.

విజయ:-ఈ విశాల విశ్వంలో బుద్ధిపూర్వకంగా ఇల్లు వీడిన క్రాంతి నాథుణ్ణి ఎక్కడని వెతుకుతావు, ఇది వ్యర్థ ప్రయత్నం.

చంప:-అదృష్టముంటే నాస్వామి పాదస్పర్శతో పవిత్రురాల నవుతాను. లేకా ఈ అన్వేషణలోనే అసువులు వీడుతాను.

విజయ:-అమ్మా! బుద్ధితెలియని బాల్యంలో అమ్మ నిర్బంధంవల్ల నీగళాన కతడు మంగళసూత్ర బంధన కావించాడు. కాని నీప్రేమసూత్రంతో బంధితుడవలేదు. అమ్మ మరణంతో బంధవిముక్తమైన విహగంలా విశ్వంలో కేగిపోయాడు. క్రాంతినాథుడి హృదయంలో ఒక్కశిల్పకళా సరస్వతికే తావున్నది. తిరిగి పోదాం పద.

చంప:-నాస్వామి నన్ను తిరస్కరిస్తే చరణదాసిగానయినా ఉండనీయడా! పతిపరిత్యక్తనై తిరిగి వచ్చి అపహాస్యాల పాలుకావడంకన్నా మరణం శ్రేయస్కరం.

విజయ:-సరే! నేటినుండి ఇరువురం అతన్ని వెతుకుదాం పద.

చంప:-ఈ ఒక్కరోజు ఆగిపోదాం. ఇవాళ గణిక చంద్రావళి వరనిర్ణయదినం ఆఖరుగడువు. నేనీసమయంలో లేకపోతే నొచ్చుకుంటుంది. ఇదే ఇదే ఆమెప్రాసాదం. ఇందుకనే జనమంతా ఆటంకరహితంగా ఈ ఏడు హజారాలు దాటి లోనికి రాగలిగారు.

విజయ:-గణిక ! కులరూప గుణాన్విత వయిన నీవు గణిక యింటనా !

చంప:-అన్నా ! చంద్రావళి సామాన్య గణిక కాదు. గుణవిద్యా రూపవిభవాదులలో ఆమె కామెయే సాటి.

విజయ:-అయినా గణికయింట నీవుండం పాడిగాదు.

చంప:-క్లిష్టసమయంలో నామానప్రాణాలు కాపాడిన పుణ్యమూర్తి ఆమె. ఈ జన్మలో నేనామె ఋణం తీర్చుకోలేను.

విజయ:-అంత గుణవంతురాలా !

చంప:-పురుషవేషంలో నాస్వామిని వెతుకుతూ ఈదేశ పరిసరారణ్యంలో చేరుకున్నాను. దొంగలకి చిక్కాను. వారునన్ను స్త్రీగా గుర్తించి బంధించి ఈపట్టణంలో అమ్మజూపారు. ఎవరో దుష్టులు నన్నర్ధనగ్నను చేసి పరీక్షించి కొనేట్టుగా బేరసారాలు సాగిస్తుంటే, అసహాయనై శోకిస్తున్న నన్ను పల్లకిలో పోతున్న చంద్రావళి చూచి ఒంటెడు నగలూ ఇచ్చి విలుచుకుంది. నాటినుండీ తన బహి ప్రాణంగా చూచుకుంటున్నది.

విజయ:-సౌహార్ధమూర్తి.

చంప:-నేడే వైశాఖశుద్ధ పూర్ణిమ. ఆమె వరనిర్ణయానికి నేడే ఆఖరుగడువు.

విజయ:-జాతివిరుద్ధంగా గణికకు వివాహమా ! చిత్రమే.

చంప:-చిత్రమేముంది? ఉత్తముడైన వరుని ఎంచుకునే అర్హత గణికకు మాత్రం లేదా?

విజయ:-ఇష్టమయితే అడ్డేవారెవరు. ఈమె వరమాల ఏ అదృష్టవంతుడి గళసీమ నలంకరిస్తుందో.

చంప:-వైశాఖశుద్ధ పూర్ణిమ లోపున తనదృష్టిలో అమూల్యమైన ప్రేమోపాయనాన్ని కాన్కపెట్టగలవారే ఆమె వరమాల కర్హులని వారం రోజుల ముందు ఆమె చాటింపించింది. అప్పటినుండే దేశదేశాలనుండి ఆమె ప్రేమ నర్థింపవచ్చిన వారికి లెక్కే లేదు. కాని ఆమె అందరినీ తిరస్కరించింది. ఏమహా భాగుని రాకకై ఆమె నిరీక్షిస్తున్నాదో ఎవ్వరికెరుక !

(తెరలో అందియలరవళి)

విజయ:-అమర ఝరీ తరంగ మృదంగ మృదుని స్వనంలా, లయబద్ధమైన ఈరవళి.

చంప:-చంద్రావళి అందియలరవళి. ఆమె అడుగుల సవ్వడిలో, హస్తచాలనంలో, ముఖభావ భంగిమలలో, భరతనాట్యశాస్త్రవేత్తలే ఒరవడులు దిద్దుకున్నారు. అదుగో ఆమె ఇట్టే వస్తున్నాది.

విజయ:-(చూచి ముగ్ధుడై) దివ్య మందాకినీ తరంగ డోలికలలో, తామరాకు పొత్తిళ్ళలో, తూగాడవలసిన ఈస్వర్ణ పద్మం ఏమహా భాగ్యశాలి హృదయ కాసారంలో వికసించడానికో భూమి నవతరించింది.

(చంద్రావళి ప్రవేశం - చంపా విజయుల్ని చూచి.)

చంద్రా:-మీరు ఒక్క వృత్తంలో కుసుమాలలా ఒకరి నొకరు పోలి యున్నారు.

చంప:-అన్నగారు.

చంద్రా:-ఆర్యా ! సుస్వాగతం. నాసోదరి చంపకు సహోదరులు మీకు స్వాగతం.

విజయ:-నాచెల్లెల్ని కాపాడిన మీకు సర్వదా కృతజ్ఞుణ్ణి.

చంద్రా:-ఈమాత్ర దానికే కృతజ్ఞత దేనికి. నేను స్త్రీధర్మాన్ని నెరవేర్చానంతే.

విజయ:-ఏజన్మాంతర సంబంధమో ఈపరిచయ భాగ్యం !

చంద్రా:-ఔను. నాతప ఫలమే మీవంటి పెద్దల సహవాస భాగ్యం. నేడు నాకు సోదరులులేని కొరత తీరింది.

(ప్రవేశం ద్వారపాలకుడు, కవిసార్వభౌముడు, గాయక శిరోమణి శ్రీ అమరనాథులవారు తమదర్శనార్థం వచ్చారు.)

చంద్రా:-లోపలికి తీసుకురా. చెల్లీ అన్నగారు ప్రయాణపు బడలికలో నున్నారు. వారికి స్నాన పానీయాదులు కూర్చి సేదతీర్చు. నేను అమరనాథులవార్ని కలుసుకుని వస్తా.

చంప:-అన్నా మనం లోనికి వెడదాం.

(విజయ చంప నిష్క్రమణ)

(ప్రవేశం అమరనాథుడు)

చంద్రా:-కవి సార్వభౌమా! స్వాగతం.

కవి:-కన్నులున్నందుకు ఈజీవితం నేడు సార్థకమయింది.

చంద్రా:-ఆర్యా! తమరాకకు కారణ మడుగవచ్చునా?

కవి:-ఏకోర్కెతో ఈసామ్రాజ్యంలో ప్రతియువక హృదయం ఈపూర్ణిమా నిశి సముద్ర తరంగంలా ఆనందనృత్యం చేస్తున్నదో ఆకోర్కెయే నన్నిక్కడికి తీసుకు వచ్చింది. తెలిసిందా సుందరీ!

చంద్రా:-(నిట్టూర్చి) తెలిసింది.

కవి:-అలరుల సౌకుమార్యాన్ని తలిరుల సోయగాన్ని పరిహసించే నీపాదపద్మాలకు పూవిరుల బాట వేస్తాను. నీబ్రతుకే ఒకతేటి పాటగా చేస్తాను. నన్ను వరించు.

చంద్రా:-(నిట్టూర్చి) ఆర్యా! అమూల్యమైన ప్రేమోపాయనాన్ని తేగలిగినవారే నావరమాల కర్హులు.

కవి:-సుందరీ! నవనీతులన్నీ నీముంగిట పెట్టేశక్తి నాకు లేదు. కాని సమస్తైశ్వర్యాలకన్నా ఐశ్వర్యవంతమైనది నాకవితాశక్తి. ప్రతిపదమూ రసముచిప్పిల్లె ప్రేమగీతాలల్లి, మోడులు చివురించేట్టుగా, దిశలు పులకించేట్టుగా, గానంచేసి నీ సౌందర్యాన్ని జగజ్జగేయం చేస్తాను. నన్ను వరించు.

చంద్రా:-దివ్య ప్రసాదితమైన మీ కవితాశక్తిని ఒక్క స్త్రీ సౌందర్య కీర్తనంకోసమా వినియోగిస్తారు? కాళిదాసాది మహాకవుల్లా అమరకావ్యాలల్లి ఆచంద్రార్కమైన కీర్తిని సంపాదించండి.

అమర:-వాణి నా రాణియై వాక్కునందు నిలువగా, నీ వర్ధాంగివై నన్నదృష్టవంతుణ్ణి చెయ్యి.

చంద్రా:-క్షమించండి. వాణి మీరాణి. సామాన్య చంద్రావళి సపత్నీత్వానోర్వలేదు. మీ మనస్సు నొప్పించినందుకు క్షమించండి.

అమర:-మాటలలో తియ్యదనము, కన్నులలో నెయ్యము, రూపంలో సౌకుమార్యమూ, నీకు ప్రసాదించిన విధాత నీహృదయాన్ని మాత్రమింత కఠోరంగా చేశాడేం? నీ శరీరం పాండుమయే నీహృదయ మన్యథాయత్తమని చాటి చెప్పుతున్నది. మరి ఈ స్వయంవరసందేశం దేనికి?

చంద్రా-క్షమించండి. కారణాంతరాలవల్ల నేనలా చాటించవలసి వచ్చింది. శలవు (అమరనాథుడు నిట్టూర్చుతూ వెళ్ళిపోతాడు. చంపతిరిగివస్తుంది.)

చంద్రా:-పాపం ఎండమావిని చూసి మోసపోయాడీ మహాకవి.

చంప:-కాదక్కా, నీ హృదయాన్ని పొందగల్గిన వారికి నీ వమృతధారా స్రవంతివే.

చంద్రా:-అన్నగార్ని సత్కరించావా.

చంప:-ఆ. భోజనంచేసి మేడమీద సుఖంగా నిద్రపోతున్నారు.

చంద్రా:-మంచిపని చేశావు. ఈ ఉత్సవకలకలంలో క్రిందనుంటేవారికి నిద్రాభంగమౌతుంది. అందులో వారు మార్గాయాస ఖిన్నులు. (ప్రవేశం ద్వారపాలకుడు, వణిక్సార్వభౌములు సువర్ణగుప్తులుంగారు. సువర్ణ వెంటపరిజనం ధన రాశితో)

చంద్రా:-ఆర్యా! స్వాగతం!

చంప:-ఈ పరిజనమంతా ఏమి మోసుకువస్తున్నారో అడుగవచ్చు.

సువర్ణ:-నూరు తరాలనుండీ నా పూర్వులు గడించి దాచిన ధనరాశి, నవనిధులన్నీ ఇంటకట్టివేశారు వారు.

చంప:-మరి ఇదంతా ఇక్కడి కెందుకు ?

సువర్ణ:-నీ అదృష్టాన్ని విలుచుకోడానికి.

చంద్రా:-అదృష్టం విలుచుకుంటే వస్తుందా (నవ్వు)

సువర్ణ:-ఎందుకురాదు. ధనం సాధించలేని కార్యం లేదు,

చంప:-దేనిని సాధించడానికి దయచేశారు ?

సువర్ణ:-చంద్రావళి హృదయాన్ని, చంద్రావళీ! నీకోసం బంగారు మేడలుకడతాను, రత్నాలరాసులు పోస్తాను, గరుడపచ్చల వితానాలువేస్తాను, ఇంద్రనీలాల తోరణాలు కడతాను, సముద్రగర్భంలోంచి ఏరితెచ్చిన మేలిముత్యాలూ, పవడాలతో నీముంగిట ముగ్గులు పెట్టిస్తాను, పారసీక దేశంలోని రత్నకంబళాలు, పరాసు దేశంలోని పట్టువస్త్రాలు, హిమాలయసీమలో పరిమళ ద్రవ్యాలు సేకరించి నీయిల్లు నింపుతాను, నీవు నాదానవుకా,

చంద్రా:-(నిట్టూర్చుతుంది)

చంప:-సానబెట్టి తావి అబ్బిన అపరంజీ, ఫలు గడిగిన మేలిముత్యాలూ ఆమె మేని లావణ్య కాంతి, మీ పగడాల చక్కదనమే ఆమెపెదిమల రక్తిమ, ఆమె చూచినచోటంతా ఇంద్ర నీలాల ధారాధళ్యాలు చిప్పిలుతాయి. నీకెంపుల ఛాయ లామె పాదాల దాల్చింది. వజ్ర వైడూర్య రత్న కాంతియే ఆనఖ కాంతి. ఇంతెందుకు ఆమె వదనమే లక్ష్మీనివాసం,

సువర్ణ:-ఏమిటీ! ఇంతకన్నా అమూల్యమైందేమున్న దీ ప్రపంచంలో.

చంద్రా:-ఒక్క స్త్రీ హృదయంలో ప్రేమ.

సువర్ణ:-(పకపకనవ్వి) ఎంతవెఱ్ఱి! ఇందులో వెయ్యోవంతుతో కోటిహృదయాలు కొనవచ్చు.

చంప:-ఎంతవెఱ్ఱి!

చంద్రా:(కోపంతో) అయితే మీకిక్కడ తావులేదు. తిరిగి వెళ్ళండి.

సువర్ణ:-ఎందుకంత కోపిస్తావు. నేను సామాన్య స్త్రీల విషయం చెప్పాను. సౌందర్య విద్యా వినయ సౌశీల్యాదులలో నీకుసాటిలేరు. ఐశ్వర్యంలో నాకులేరు. మన ఇరువురి కలియిక ఉత్తమోత్తమం. నామాట విని నన్నువరించు.

చంద్రా:-ప్రపంచంలో మీదృష్టిలో అమూల్యమైందేది?

సువర్ణ:-ధనం

చంద్రా:-అయితే నాకోసం మీధనమంతా అన్నా, కూతురులకూ అనాధులకూ పంచిపెట్టి తిరిగి రండి.

సువర్ణ:-ఒట్టి చేతులతోనా !

చంద్రా:-పొరపడుతున్నారు. సమస్తైశ్వర్యాన్ని త్యాగం చెయ్య గలిగితె ఆ హస్తం రిక్తహస్త మెప్పుడూ కాదు.

సువర్ణ:-వైశ్యుడికి ధనమే ప్రాణం, ధనం మినహా జీవితమే శూన్యం. ఇంక ప్రేమానుభవమేమిటీ, ధనం సాధించలేనిది కూడా ఉందని నేడు తెలుసుకున్నాను. ఇక ఇక్కడెందుకు?

చంద్రా:-శలవు.

(సువర్ణ నిష్క్రమణ.)

చంప:-ఎంత ధనప్రలోభం!

చంద్రా:-వెఱ్ఱివాడు పాపం!

(ద్వార: నగేంద్రనాధ రాయలుంగారు)

చంద్రా:-రాజలక్షణ లక్షితుడైన ఈక్షత్రియ వీరుడెవ్వరో !

చంప:-ప్రచ్ఛన్నుడై నిను వరింపవచ్చిన ఏమహారాజో అయి ఉంటారు.

చంద్రా:-ప్రభూ! స్వాగతం!

నగేం:-(ముగ్ధుడై ఆమెను చూస్తూ) ఈస్వాగతమే నీహృదయం కూడా కోరితే నే మదృష్టవంతులమే.

చంద్రా:- అదృష్టానికి పాదరసంలా చలనం ఎక్కువ ప్రభూ!

నగేం:- నేడు మా అదృష్టానికి పరీక్షదినం!

చంప:- తమరాకకు కారణ మడుగవచ్చునా ప్రభూ!

నగేం:- వేరే ఏముంటుంది? త్రిజగన్మోహనమై జగమంతా వెలుతురు నింపే చంద్రావళి సౌందర్యజ్యోతి ఎందరి హృదయాలలో రాగజ్యోతిని వెలిగించలేదు?

చంద్రా:- నశ్వరమైన స్త్రీ సౌందర్యంలో కోరదగ్గదేముంది ప్రభూ!

నగేం:- అయితేనేం, అంతశ్శక్తివంతమూ, ఆకర్షణీయమూ అయినా ప్రపంచంలోనే లేదు.

చంప:- తామెవ్వరో అడుగవచ్చునా.

నగేం:- (నవ్వి) తెలుసుకోవాలని కోర్కె ఉన్నదా?

చంప:- తెలుసుకోకుండా.

నగేం:- మావిలువ ఎలా తెలుస్తుంది. నిజం. ఇదిగో మారువేషాన్ని తీసివేస్తున్నాను. ఇప్పుడైనా ఎవ్వరో తెలుసుకోగలవా?

చంద్రా. చంప:- (చకితులై) జోహారు ప్రభూ! జోహారు! అర్థిజన కల్పతరువులూ, సకలకళాపోషకులూ, మహారాజ రాజేశ్వర, రాజమార్తాండ, నగేంద్రనాథ రాయలవారిని ఎరుగనివారెవ్వరు ప్రభూ!



నగేం:- అర్థిజన కల్పతరువయిన నగేంద్రుడు నేడర్థియై నీప్రేమల నర్థిస్తున్నాడు. జవాబియ్యి చంద్రావళీ!

చంద్రా:- గణిక చంద్రావళి మహారాజాధిరాజులు మా కివ్వదగ్గ దేముంది ప్రభూ!

నగేం:- నీసౌందర్యానుభూతి.

చంద్రా:- (అభిమానములో) చంద్రావళి పుట్టువుచేత మాత్రమే గణిక వృత్తియందు కాదు ప్రభూ!

నగేం:- ఆవిషయం మాకు తెలుసు. మట్టిలో పుట్టినా మహారాజ మకుటాలంకారార్హమయింది మాణిక్యం. ఇదిగో! సకల శత్రురాజన్య మకుట మాణిక్య పాళిలో పొదగబడిన మహారాజ్ఞి కిరీటమే నీకు ప్రేమోపాయనం, ఏమంటావు?

చంద్రా:-గణికకు మహారాజ్ఞీత్వం రాజధర్మ విరుద్ధం ప్రభూ!

నగేం:-ధర్మాన్ని నిర్ణయించేది మేము. ఆశంక నీకనవసరం.

చంద్రా:-ఇది మహత్తరమైన కానుక - కాని -

నగేం:-(తీక్షణంగా) చెప్పు. ఇంతకన్నా అమూల్యమైన ప్రేమోపాయనం ఉన్నదా!

చంద్రా:-లౌక్య దృష్టిలో లేకపోవచ్చు. కాని -

నగేం:-కానీ నీసందేహం.

చంద్రా:-చెప్పమంటారా ప్రభూ! అని మొనతేగి పడిన మహారాజుల హృదయ రక్తస్రుపితమైన మకుట మాణిక్యాలు నాదృష్టిలో రక్తపు ముద్దలతో సమానం.

నగేం:-శత్రు మారణం క్షత్రియుడి పరమధర్మం.

చంద్రా:-కావచ్చు. కాని చంద్రావళి క్షత్రియాంగన కాదు. ఆమె గుండె బహుపేదది. ఆమె దృష్టిలో హింసాపూరితమైన శత్రుమారణానికి సామాన్య హత్యాకాండకూ ఏమీ భేదం లేదు. జానెడు నేలకోసం కోటాను కోట్ల జీవితాలు నేలపాలు చేయడం ధర్మమని భావించలేను ప్రభూ! క్షమించండి.

నగేం:-ఇది తిరస్కారమా!

చంద్రా:-కాదుప్రభూ! కేవలం అనర్హత, మానవ రక్తదూషితమైన కిరీటాన్ని క్షత్రియాంశంలేని నేను దాల్చ నర్హను. దానిబరువుతో నా ఆత్మ అతః పాతాళానికి క్రుంగి పోతుంది.

నగేం:-గణికకెంత అహంకారం. రాజు తల్లుచుకుంటే-

చంప:-దెబ్బలకు కాదువా! (భయంతో) అక్కా!

చంద్రా:-ఆవిషయం నాకు తెలుసు ప్రభూ! కాని ఈశరీరాన్ని నా ఇష్టానికి వ్యతిరేకంగా ఎవ్వరూ పొందలేరు.

నగేం:-చూద్దాం. ఎవరడ్డుకుంటారో?

చంద్రా:-పొరబడుతున్నారు ప్రభూ. మీసేవకులు లోనికి రాకముందే ఈ ఉంగరంలో గరళంతో నా ఆత్మ పరలోకాన్ని చేరుకుంటుంది. ఇక మీకు మిగిలేది జీవచైతన్యంలేని కళేబరం.

(ఉంగరం నోట్లో పెట్టుకోపోతుంది)

చంప:-అక్కా! అక్కా! (చేయ్యి పట్టుకుంటుంది)

చంద్రా:-చేయి వదులు చంపా! స్త్రీకి మానహాని కన్నా ప్రాణహానియే ప్రియతమం.

నగేం:-(చకితుడై చంద్రావళిని ఆపి) ఆగు! శెబాస్, వీరాంగన వంటే నీవే! నీమనసుకి వ్యతిరేకంగా నిన్ను పొందేంతటి పశుతుల్యుడు కాడు నగేంద్రుడు. ఒక స్త్రీ ఆత్మౌన్నత్యం ముందు నేడు మహారాజు సంకల్పమే వీగిపోయింది. సరే.

(వెళ్ళిపోతాడు కాసేపు నిశబ్దం)

(సశేషం)

---

# ★ ఉంగరము : పుట్టు పూర్వోత్తరములు ★

శ్రీమతి యం. సుశీలాదేవి

అశోకవనంలో అహోరాత్రులూ శ్రీరామచంద్రుని గూర్చి నిరీక్షిస్తూన్న సీతాదేవికై అన్వేషించిన హనుమంతుడు సీతామ్మవారికి శ్రీరాముని వ్రేలియుంగరమును ఆనవాలుగా చూపించిన ఘట్టం నాటికికూడా ఉంగరం ప్రణయ చిహ్నంగా పరిగణింప బడుతూన్న సంగతి విదితమే.

కాళిదాస మహాకవి శాకుంతలం ఉంగరం మీాదనే ఆధారపడివుంది. దుష్యంత మహారాజు ప్రణయ చిహ్నంగా శకుంతల వ్రేలికి ఉంగరం తొడిగి గాంధర్వ వివాహము చేసుకొని తరలిపోతాడు. అత్తవారింటికి వెళ్లిన శకుంతల ఉంగరం పోగొట్టుకొని వెడుతుంది. దుర్వాసమహాముని శాప మహత్యంచేత దుష్యంతుడు శకుంతలను వివాహమాడిన మాట మరచిపోతాడు. తర్వాత కథ అంతా అంగుళీయానిదే.

శ్రీరామచంద్రుని నాటినుంచి "ఉంగరాలు మరచి వస్తిని కదరా ... చల్ మోహనరంగా!" అన్న నేటివరకూ ఉంగరం ప్రణయచిహ్నంగానే నిలిచిపోయింది. తర్వాత తర్వాత చిత్ర చిత్రమైన కథలతో ప్రపంచ సాహిత్యంలోకూడా ఉంగరం స్థానం సంపాదించుకుంది.

నేడు ఉంగరం పరిణయకాండలో ఎంతో పవిత్రమైంది. దంపతుల మధ్య ప్రణయ చిహ్నము; శ్రీరామరక్ష; రక్షరేఖ అటువంటి ఉంగరం జీవితగాథలో ఎన్నో చిత్రమైన పరిణామ ఘట్టాలున్నాయి.

ఒకరకమైన ఉంగరం ధరిస్తే పాప పరిహారం కలుగుతుందనీ, పంచలోహ అంగుళీయకం ప్రపంచ భోగభాగ్యాలను సంపాదించి పెడుతుందనీ, ఇప్పటిలాగ పూర్వీకులు నమ్మేవారు. ఉంగరాన్ని అదృష్ట దేవతగా భావించి ధరించేవారు, ధరిస్తున్నారు.

దేశకాలపాత్రలననుసరించీ, ఆనాటి ప్రజ నాగరికత ననుసరించీ ఉంగరం చరిత్ర సాగింది. నైలునదీలోయ ప్రజల నాగరికత ఒకానొక కాలంలో అత్యున్నతమైనదని చరిత్ర చదివితే తెలుస్తుంది. ప్రణయ చిహ్నంగా పరిగణింప బడటమే కాకుండా, ఐగుప్తీయుల ధనం ఉంగరాల రూపంలో చలామణీలో ఉండేది. నేడు మనం వాడుకునే నాణాలుగా ధనాన్ని మార్చుకోడం వారికి తెలియదు. బంగారాన్ని గుండ్రంగా ఉంగరంలా తయారుచేసి చలామణీలోకి తెచ్చుకొనేవారు. వివాహ సమయమందు అటువంటి బంగారపు చుట్టును పెళ్లికొడుకు భార్యవ్రేలికి తొడిగేవాడు. "నా ఆస్తి ఉపాస్తులన్నీ నీకు అప్పచెప్తున్నాను ప్రియతమా" అనే దానికి చిహ్నమే ఆనాటి ఐగుప్తీయుల ఉంగరము. ప్రాచీన బేబిలోనియన్, ఐగుప్తీయుల సమాధులనుండి రకరకాలైన ఉంగరములు బైటపడ్డాయి.

దేశం నాగరికత సాధించినదై ఉండదు. కారణం దేశదేశాల ప్రజలమధ్య రాకపోక లెప్పుడూ ఉంటాయి. తత్ఫలితంగా అభిరుచు లలో, ఆచారాలలో మార్పులుకల్గుతాయి. ఐగుప్తీయుల నాగరికత క్రైస్తవ దేశాల లోకి ప్రాకిన ఫలితంగా వైవాహికచిహ్నంగా అంగుళి ఏర్పడింది.

గ్రీసుదేశం నాగరికతకి పురుడుపోసి పెం చిందని చరిత్రకారులంటారు. కాని చాలా మంది చరిత్రకారులు ఆవిషయం గురించి ఒప్పుకోరు. నాగరికత ఎక్కడ పుట్టిందో - ఓం ప్రథమంలో-మనకి ప్రస్తుతం అప్రస్తుతం. కానీ గ్రీకుల నాగరికతలోకూడా ఉంగరం ప్రణయ చిహ్నంగా ప్రచారంలో వుంది. అంగుళి ఆగమనం గురించి ఒక తమాషా గాధ ఉంది.

ప్రొమిథియస్ స్వర్గాన్నుండి అమర జ్యోతిని దొంగిలించాడు. జ్యూస్‌కి కోపం వచ్చి చేసిన కృత్యానికి శిక్ష అనుభవించ మని శపించి ప్రొమిథియస్ వ్రేలికి ఒక గొలుసు చుట్టు తగిలించి ఆ గొలుసుతో అతనిని ఒక బండరాయికి కట్టివేశాడట. ఆ గొలుసు చిహ్నమే ఆ ఉంగరమట. ఇలాగ ఎన్నో కథలున్నాయి. గ్రీకుల ఉంగ రాలు - ఆకాలంలో బంగారుతో తయా రైనవికావు. ఇనుముతో తయారు చేసే వారు. అన్నట్లు గ్రీకులకు ఉంగరాలంటే చాలా వెర్రి. అందుకని అన్నివ్రేళ్లకీ రత్న ఖచితమైన ఉంగరాలను ధరించేవారట.

ఐతే ఉంగరం ఏచేతికి ఏవ్రేలికి తగి లించుకోవాలనేదికూడా వుంది. స్త్రీ ఎడమ చేతి మూడో వ్రేలికి తగిలించుకోవాలట. అది అర్ధాంగి చిహ్నమట. పైగా మూడో వ్రేలు! ఆవ్రేలినరం తిన్నగా గుండెచేరుతుం దట. హృదయానికి చేరువగా భార్య వుం టుందికాబట్టి ఆవ్రేలికే ఉంగరాన్ని తగి లిస్తాడు పెళ్లికొడుకు!

రోమనుల ఆచార వ్యవహారాలలో అంగుళీయకం ఎటువంటి స్థానం ఆక్రమిం చిందో తెలుసుకుందాము.

రోమను మహాసామ్రాజ్యం చరిత్ర ప్రసిద్ధమైనది. రోమన్ చక్రవర్తుల దిగ్వి జయ యాత్రల ఫలితంగా ఎన్నో దేశాల నాగరికతలు రోమనుల జీవితాలకు మెరు గులు దిద్దాయి.

రోమనులుకూడా ఉంగరాలు ధరిం చారు. కానీ అవి వివాహ చిహ్నాలుగా కాక వీరచిహ్నాలుగా వుండేవి. గ్రీకుల వలెనే ఇనుప ఉంగరాలు రోమను వీరులం దరూ ధరిస్తే, అంతకన్నా పై అంతస్థులో ఉండే రోమను అధికారులు బంగారపు టుంగరాలు ధరించేవారు. గ్రీకుల ఉంగ రాల వెర్రి రోమనులకు కూడా వుండేది. మంచి మంచి విలువగల రాళ్లతో రకరకా లైన ఉంగరాలు రోమనులు తయారు చేయించుకొని ధరించేవారు.

రోమనులు ఉంగరాలను ఆత్మ హత్య చేసుకొనేటందుకు కూడా వాడేవారు.

ఎలాగునంటే రోమన్ చక్రవర్తులు, సైనికాధిపతులు, ఎప్పుడూ ఉంగరంలో విషాన్ని దాచుకొని ఎక్కడ, ఎప్పుడు, ఏయుద్ధములో అపజయం కల్గినా వెంటనే శత్రువు చేత చిక్కకుండా వుండేందుకు ఆ ఉంగరాన్ని పళ్లతో పగలగొట్టి ఆవిషంతో ప్రాణత్యాగం చేసేవారట.

ఉంగరాలు - ముష్టి యుద్ధములలో ఎంతో సహాయకారిగా వుండేవి. ఆయుద్ధాలలో వాడే ఉంగరాలకు ఇనుము బంగారాల సూదులు పొదగబడేవి.

ఈవిధంగా అనాదినుంచీ ఉంగరం అన్ని దేశాలలోనూ పవిత్రస్థానాన్ని సంపాదించుకుంది, సంపాదించుకుంటూ వుంది.



'నాయిల్లు' చిత్రంలో విద్యావతి





ఇంపైన

రంగులకు,

మంచి డిజైన్లకు,

సున్నితమునకు, మన్నికకు,

దేశమంతట ప్రఖ్యాతిచెందిన

**కో-ఆప్టెక్స్**

చేనేత వస్త్రములనే

వాడండి.



**కో-ఆప్టెక్స్ వస్త్రములు**

ది మదరాసు స్టేట్ హాండులూం వీవర్సు కో ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్

జెమ్మి బిల్డింగ్సు : 48/1 రాయపేట హైరోడ్డు, మదరాసు-14.

# అమరజీవికి ఆంధ్రుల అశ్రుతర్పణము

కంజేపు ఈశ్వరాచార్యులు

ఆంధ్రుల రక్తనాళముల యందలి శక్తి సమీకరించగా
నాంధ్రుల రాష్ట్రసాధనకునై యసువుల్ దృణమట్టు లీవిశా
లాంధ్రకు నంకితంబొసగినట్టి త్వదామరణాంత దీక్షచే
నాంధ్రుల గుండియల్ గలచినట్టయె పొట్టికులాబ్ధిచంద్రమా!

రామ పదారవిందమకరందము గ్రోలుచు లక్ష్యసిద్ధికై
నీమముఁదప్పకన్ శ్రమగణింపక దివ్యతపస్సుఁజేసి స్వ
ద్భూమినలంకరించితివి, పూజ్యుడవయ్య మహాత్మ పొట్టి శ్రీ
రాములునామ, నీయశము రంజిలు నాంధ్ర ధరాతలమ్మునన్

పారములేని ఆంధ్రభువిపైఁగల భక్తిని లక్ష్యపూర్తికై
నీరముఁగ్రోలి ఏబదియునెన్మిది నాళ్లుపవాసముండి, శా
రీరబలమ్ము కాలముగ్రసింపగ బ్రాణములన్ త్యజించి, జో
హారులు గొంటివీవు, నిఖిలాంధ్ర జనావళిచే మహాత్ముడా!

అక్షయమైన నీచరిత మాంధ్రుల రాష్ట్రచరిత్రలో సువ
ర్ణాక్షర పంక్తులన్ లిఖితమై శుభకీర్తిని వెల్గు, నా జగ
చ్చక్షు హిమాంశు తారకల సత్ప్రభలుండెడుదాక తెన్గు కం
జాక్షులు భక్తినిచ్చు శుభహారతి నీమది శాంతిఁ గూర్చుతన్.

తిక్కన కవిశక్తి, తిమ్మరుసు ధీశక్తి । చాటరా దేశ దేశాలకీవు,
త్యాగయ్యగానంబు, దానివిజ్ఞానంబు । పాడరా భావాలు పల్లవింప,
రాయల భుజశక్తి, రామలింగనియుక్తి । వినిపించరా జగద్విస్మయముగ,
వీరమాతలమాట, వీరపత్నులధాటి । వివరింపరా శత్రుభీకరముగఁ

తెలుఁగు గడ్డకు నలనాటి తేజమొనసి
సద్యశస్స్ఫూర్తిఁగ్రాల రాష్ట్రంబు శాంత
పద్ధతులతోడఁ జక్కగా సిద్ధపరచి
దిద్దుకొనలెమ్ము రాజ్యమ్ము తెలుఁగువాడ.



ప్రాణాయామం పట్టి
ముళ్ల పరుపుమీద పడు-
కోవడం సన్యాసికి చేతనయితే

# లోధ్ర




సేవించి ఆరోగ్య ★★★
సౌందర్యాలు పెంపొందించు
కొంటూ ఉత్సాహంగావుండ
డము ఆమె చేతనవును.

"లోధ్ర" ఋతు దోషాలను
పారద్రోలి ఆరోగ్య సంతోష
సంతానములను సంప్రాప్తింప
జేయును



## కేసరి కుటీరం లిమిటెడ్,
## రాయపేట, మద్రాస్.

తెలుగు జిల్లాలకు, నైజామునకు, తమిళనాడునకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

# ప్రజాసేవకుడు

శ్రీ కె. సభా

నంజప్ప చాలా నాజూకైన మనిషి. నలభై సంవత్సరాలు నిండినా నవనాగరికత ఆయనలో నాట్యం చేస్తూనే వుంటుంది. గోరంచు మిల్లు పంచె, యం. యస్. లాంగ్ క్లాత్ జుబ్బా, టర్కీ టవలు అతడు అప్యాయంగా వాడే వస్తువులు. మెలివేసిన మీసాల కొసల్లో గజనిమ్మపండ్లు నుంచితే అలాగే నిలబడుతాయని ప్రతీతి. ఆ ఠీవి ఆ దర్పము గ్రామాన్నంతా హడలెత్తించేవి.

రెండవ ప్రపంచ యుద్ధంలోనే నంజప్ప రాజకీయాల్లో ప్రవేశించాడు. ఆనాడు తానుచేసిన సహాకారానికి ప్రభుత్వం దివాన్ బహద్దూర్ అనే బిరుదాన్నిచ్చి సత్కరిస్తుందని ఆశించాడు. కానీ అలా జరుగలేదు. చివరకు జిల్లాబోర్డుకు మెంబరుగా నామినేట్ చేశారు.

ఇంతలో దేశంలో కాంగ్రెస్ వాళ్ల హడావిడి హెచ్చింది - ఫలితంగా ఏదో స్వతంత్రం వచ్చేసిందన్నారు. దేశమంతా వెంటనే మారిపోతుందన్నారు. దేశం ఎంతమట్టుకు మారిందో ఎవరికీ తెలియదుగానీ నంజప్ప మాత్రం కొద్దిగా మారిపోయాడు. టర్కీ తువ్వాలు స్థానే సరిగంచు ఖాదీపంచ; కట్టుపంచ స్థానే ముతక ఖద్దరు; లాంగ్ క్లాత్ స్థానంలో కావిరంగు దేశీయజుబ్బా కనబడ్డాయి. మీసాలనుగూడా కొద్దిగా కత్తిరించాడు. చలవ కళ్లజోళ్లు ఒక క్రొత్త అందాన్ని తెచ్చిపెట్టింది.

ఏవో ఎన్నికలు మన్నికలు అంటుండగానే నంజప్ప కాంగ్రెస్ రాజకీయాల్లో అంతగా కనబడకపోయినా ఏదో మళ్ళీ ఒక ముఖ్య స్థానాన్ని ఆక్రమించినట్టు మాత్రం తెలిసింది. ఆనాటినుండి వారిలో చాలా ప్రత్యేకతలు కనబడుతూ వచ్చినై. గ్రామానికి సంబంధించిన సమస్త వ్యవహారాలూ తనచేతిమీదుగానే జరగాలనే పట్టుదల వారిలో ఎక్కువైంది.

కుంట కట్ట మరమ్మత్తుకోసం గ్రామస్థులను రాయబారం తీసుకెళ్ళాడు. దైవకార్యంలాగా అందరూ నడుంకట్టి అనుకరించారు. ఐదువేల రూపాయల కాంట్రాక్టు. అందులో మూడువేలు నంజప్పగారు శుభ్రంగా మిగుల్చుకున్నట్టు తేలడానికి ఎన్నో రోజులు పట్టలేదు. ఆరోజునుండి నంజప్ప అంటే గ్రామంలో ఎవరికీ పడదు. కానీ పైకి మాత్రం ఆయన్ని గౌరవించక ఎవరికీ తప్పలేదు.

నంజప్ప చాలా మంచివాడేగాని లంచగొండి అని కొందరనేవారు. కాదు వారు గొప్ప కార్యసాధకులు. ఎన్నో తరాలనుండి రిపేరుకాని కుంట కట్ట వారి కాలంలో రిపేరైందని మరికొందరు పొగిడేవారు.

కాలం యిలా దొర్లుకుపోతుంటే కరువుదేవత వికటాట్టహాస ఘోషలతో గ్రామంలో అడుగు పెట్టింది. రైతులవద్దనున్న బంగారంలో ముప్పాతిక వంతు నంజప్ప బొక్కసంలో దాక్కోవలసి వచ్చింది. నంజప్ప మాత్రం చాలా చురుగ్గా బహుహుషారుగా ప్రజాసేవలో లీనమైనాడు. అతనికి తీరిక అంటూ చిక్కడంలేదు. దాదాపు వంద చెడ బావులు కంట్రాక్టు పుచ్చుకొన్నాడు. చాలినంత డబ్బులు ఖర్చుపెట్టి అధికారుల అండ దండల్ని సంపాయించాడు. లోన్సు ఆధికారులకు ఎన్నో విందులు చేశాడు. ఆ చుట్టుపట్ల గ్రామాలనుండి తన యింటికి అనుదినం లెక్కలేనన్ని కోడిగ్రుడ్లు పాలకావిళ్ళు వస్తుండేవి. ఇప్పుడు నంజప్పగారి యిల్లు నగరైపోయింది. వారికి ఒక చిన్నకారు

కూడావుంది. అతడు కష్టజీవి గనుక ప్రభుత్వం కూడా గమనించి వ్యవసాయాభివృద్ధికి పదివేల రూపాయలు అప్పు పెట్టింది. ఆ డబ్బుతో క్రొత్తగా బస్సురూటు సంపాదించి ప్రయాణీకుల సౌకర్యం కోసం బస్సును అవసరమైతే ఎక్కువసార్లు నడుపుతున్నాడు. రూటు రోజుకు మూడుపూటలిస్తే ప్రజల సౌకర్యార్థం ఐదుసార్లు నడిపిస్తాడు. ఎవరికీ సీటులేదనకుండా ఓవర్‌లోడ్ వేసే ధర్మన్యాయం నంజప్పలో మూర్తీభవించింది.

బస్సువ్యాపారం ప్రారంభించినప్పటినుండి నంజప్ప పలుకుబడి బాగా హెచ్చింది. నంజప్ప బస్ సర్వీస్ పరివారం కూడా కొంత బలాన్నిచ్చింది. నంజప్ప మాటకు ఎదురులేదంటే అతిశయోక్తి అట్టే వుండదు.

గ్రామంలో రైతులు చాలా నీరసించి పోయారు. ప్రక్కింటి వరాలు తన పది ఎకరాలు అమ్మాలనుకున్నాడు. అదివరకే రెండువేలు నంజప్పకు అప్పబడ్డాడు గనుక ఏడువేలకు పొలానిచ్చి రెండువేలు అప్పుపోగా వెయ్యిరూపాయలు బాకీగావుంచి రెండువేలుపుచ్చుకొని వెళ్లిపోయాడు. పదియెకరాల ఆసామే వెళ్లాక చిల్లర రైతుల విషయం చెప్పనే పనిలేదు. ఎవరికి వారే యమునాతీరే ఐపోయారు. సగంమంది పొలాలు నంజప్పకే ధారపోశారు. గ్రామంలో జనాభా చాలా మట్టుకు తగ్గిపోయింది. మిగిలిన ఆ కొద్దిమందీ వచ్చి మేమూ వూరువదలి వెడుతున్నామని గోలచేశారు.

నంజప్ప దయార్ద్రహృదయుడు గదాని కనికరించారు. మీరంతా భయపడకండి, మీకు గంజి పోయిస్తానని అభయహస్తమిచ్చి అందరూ యిందులో సంతకాలు పెట్టండంటూ ఒక మహజరు వ్రాసి పెట్టాడు. కూలీలు రైతులు సంతోషంతో వ్రేలిముద్రలు వేశారు.

ఆ ఉదయమే నంజప్ప బాగా ముస్తాబై చక్కా జిల్లా అధికారి బంగళాకు వెళ్లాడు. నా గ్రామం స్మశానంలా తయారైంది. గంజికేంద్రం పెట్టకుంటే ఎవరిప్రాణాలూ దక్కవు, కనికరించాలంటూ అర్థించాడు. అందులో తానే స్వయంగావుండి నిర్వహిస్తానని నచ్చచెప్పి పదిమూటలు జొన్నలు నాల్గు బస్తాలు వుల్లిపాయలు, రెండుబస్తాలు పెసలు, రెండు బస్తాలు గోధుమలు, బస్తా ఉప్పు, బండకెక్కించుకొన్నాడు. బంగళా దాటుకొన్నదే బేరం ప్రారంభమైంది. ఉచితంగా వచ్చిన సొమ్ముగనుక ఐదు వందలకు అక్కడే విడిలించుకొని యిల్లువచ్చి చేరాడు.

గంజి కేంద్రం ఆరంభమౌతుందని గంపెడాసతో నున్న గ్రామస్థులు ఏమయిందంటూ అడిగారు. ఇంకోవారం అన్నాడు. ఇలాగా మూడుమాసాలు దొర్లి పోయినై. నంజప్పగారికీ వ్యాపారంలో అప్పుడే మూడువేలు లభించినై.

ఈలోగా ఎవరో కిట్టనివారు మెల్లగా పుకారు లేవదీశారు, నంజప్ప గంజిగింజలు అమ్మివేస్తున్నాడని. వెంటనే నంజప్ప మేలుకొని దేనికైనా మంచిదని ఊళ్లో ఒకచోట గంజిదొడ్డి ప్రారంభించాడు. రోజుకు 28 శేర్ల జొన్ననూక, 5 శేర్లు బియ్యం, మూడు శేర్ల పెసరపప్పు, ఒక్క మణుగు ఉల్లిపాయలు లెక్క చూపుతూ రిజిస్టర్లను సక్రమంగా వుంచాడు. పనిచేసే వారికి జీతాలు; కట్టెల ఖర్చులు; మోతకూలీలు; బండి బాడుగలు; వీటిక్రింద ప్రతినెలా వందా యాభై రూపాయలు లెక్కచూపేవాడు. నిజానికి నాలుగు శేర్లు జొన్ననూకలు పోసి రెండు బానలు గంజికాచి అందులో రెండు బానలు నీరుపోసి నాలుగుబానలు పోయించేవాడు. ఆ గంజికూడా తనపొలంలో సేద్యం చేసేవారికేగానీ యితరులకు ఒక్కచుక్కైనా పోసేవాడు కాదు.

ఈ విషయం అంతా ఆ వూరి కరణంగారికి తెలియక పోలేదు. ఆయన యిందులో కల్పించుకుంటాడనే, హుషారుగా కరణంగారికి రోజుకొక శేరు బియ్యం పంపించేవాడు. మునసబుగారి యింట్లో రోజూ పెసరట్లే టిఫినైపోయింది. కరణంగారికి ప్రతిపూటా ఉల్లిగడ్డల సాంబారు రుచిగావుండేది

నంజప్ప మాత్రం రోజుకు ఇరవైనాలుగు శేర్లు చొప్పున మిగిల్చి ఎప్పటికప్పుడు అమ్మివేసేవాడు.

కరణం మునసబులు చేతిలో వున్నారు గనుక ఆయనకు యేతొందరగూడాలేదు.

ఇంతలో ఆ గ్రామానికి ఒక కొత్త స్కూల్ మాస్టర్ బదిలీ అయ్యాడు. ఆయన చాలా పని వాడు. ఓ నాడు గంజికేంద్రాన్ని చూచాడు. అతనికి చాలా ఆశ్చర్యం గల్గింది. వారి స్వగ్రామంలో గంజిపోస్తున్నారుగానీ ఆ విధానంలేదు...

అక్కడ ప్రతివానికి చీటీయిచ్చివున్నారు. ఆ చీటీచూచి అందులో గుర్తుపెట్టుకొని గంజిపోయించుకోవాలి. ప్రతివానికీ అర్ధశేరుకు తక్కువ కాకుండా పోస్తారు. పైగా అక్కడయిచ్చే రేషన్ యింతేవిశా పదేను కడవలు నిండుతాయి. వాటిలో వుల్లిపాయలు పెసరపప్పు గోధుమలు కలిసి వుండడంవల్లా చాలా కమ్మగా మధురంగా రుచిగా కూడా వుంది. అక్కడ కూలీలందరూ సరదగా పోసుకొని సంతోషంగా త్రాగి వెడుతుంటారు. గంజిపోసేవారు నవ్వుముఖాలతో వుంటారు. పనిచేసేవారు వుచితంగా చేస్తారు.




కట్టెలు గంజిత్రాగేవారే స్వయంగా బండ్లకొద్ది తెచ్చి పారేస్తున్నారు. గంజిదొడ్డికి ఒక ప్రత్యేకమైన కొట్టంవేయబడింది. చక్కని పందిరి నీడకోసం నిర్మించబడింది. గ్రామంలో యువకులందరూ శ్రద్ధపుచ్చుకొని పనిచేస్తుంటారు. గంజిగూడా చాలా మెత్తగా ఎక్కువ గట్టిగ కనబడుతుంది.

కానీ యిక్కడ అలాగాలేదు. యమకింకరుల లాగా యిద్దరు మనుష్యులు నిలువు కఱ్ఱబుచ్చుకొని ఆ యనాథ బిడ్డల్ని గెంటివేస్తున్నారు. ఆ తోపుల్లో వృద్ధులు నేలమీదపడి సోలిపోతున్నారు. ఒట్టి తొక్కు అడుగునపోగా మిగిలి కొద్దిగా వాసనవేసే కుడితికోసం పడుతున్న కీచులాట! ఆ విషాదపూరిత నయనాలనుండి చిమ్ముతున్న ఆకలిజ్వాలలు అతని కడుపును రగిల్చివేసినై.

"ఎవరీ గంజిపోయుటం? ప్రభుత్వమా? ప్రత్యేకమైన సంస్థఏదైన పోస్తున్నదా?" అన్నాడు పంతులు.

మాకు తెలియదన్నాడు ఆ గంజిపోసే కింకరుడు. ఆ ఆవేదనాపూరిత దృశ్యాన్ని చూడలేక బడికి వచ్చేశాడు పంతులు. కానీ అతని మనస్సు నెమ్మదిగా వుండలేక పోయింది. ఆరాత్రి హరిజనవాడకు వెళ్లి

మెల్లగా ఆ చూకీ తీశాడు. విషయం తెలుసుకొన్నాక అతనికి ముచ్చెమటలు పోసినై. లోకంలో అనాథలను పోషించే అదృష్టంలేక ఎందరో అఘోరిస్తున్నపుడు అందే గంజినిగూడా దొంగిలించే నీచులు కిరాతకులు వున్న విషయం అతనికి క్రొత్తగా కనిపించింది. కానీ ప్రఖ్యాతిగన్న మనదేశంలో శిబిచక్రవర్తులు కీర్తిగన్న ఈ పవిత్రభారతంలో ఈలాంటి గంజిదొంగలు యెందరున్నారో అతనికి తెలియదు. ప్రత్యేకించి రాయలేలిన రతనాలసీమలో వందలు గాదు వేలమంది ఈ వ్యాపారంలో వేలనుగడిస్తూ డబ్బుతోపాటు మహాదాతలని దానకర్ణులని పేర్లనార్జించు కుంటున్న విషయం అతనికి తెలియదు.

అతని హృదయంద్రవీ భూతమై పోయింది. ఆ వేడిలో అధికారికి పెద్ద రిపోర్టువ్రాసి గంజిత్రాగే వారినందరినీ సంతకాలు పెట్టమన్నాడు. అంతసాహసానికి నోచుకొనే గుండెలు వారికిలేవని అతనికి తెలియదు. కానీ అతిప్రయత్నం మీద ముగ్గురు మాత్రం వ్రేలిముద్రలు వేశారు. పంతులు గుండెలను రాయిచేసుకొని అదిరే చేతులతో అడ్రస్సు వ్రాసి టపాల్లో వేశాడు.

ఐదురోజులు గడిచాయి. ఉన్నట్టుండి అధికార్లు అమాంతంగావచ్చి గంజిదొడ్డిని తణిఖీచేసి తనకళ్ల యెదట నంజప్ప చేతులకు బేడీలు వేసిలాక్కొని వెళుతారని అతడి ఆలోచన. అదేకలలు కన్నాడు. కానీ ఆరవరోజే అతనికి శ్రీముఖం అందింది. అతణ్ణి ఏకారణం చూపకనే అరువదిమైళ్ల కావల ఒకపల్లెకు మార్చివేశారు. ఆ రోజూ సాయంకాలం నంజప్ప అతనిముందు సాక్షాత్కరించాడు. పీపాలకొద్దీ గంజి త్రాగి బలసిన బొజ్జలాగా కనబడే తనబొజ్జను నెమ్మదిగా తడుముకుంటూ... ఏమయ్యా చూచి పురుగుతిని పుట్టలోవుండకుండా యీలాంటి పనులకువస్తే యింతే జరుగుతుంది. ఇంతకూ పనివాడని, వృద్ధికి రావలసిన వాడనీ విడిచిపెట్టాను. లేకుంటే శుభ్రంగా దేహశుద్ధి చేయించి పంపేవాణ్ణి. జాగ్రత్త అన్నాడు.

ఆ వికృత స్వరం వింటుంటే పంతులుకు చాలా అసహ్యంవేసింది. ముఖాన ఉమ్మివేద్దామన్నంత కోపం వచ్చింది. గొంతు నులిమేద్దామన్నంత వుక్రోషం వచ్చింది. కానీ లెక్కలేని పెసరట్లుతిని; మదమెక్కి ఆ మెలితిరిగిన కండలు; మణుగులకొద్దీ వుల్లిపాయలుతిని బలిసిన ఆ మాంసపర్వతానికి చాలినంత పలుకుబడివుంది. చెప్పగూడదు కానీ అతడు ఒక బాధ్యతాయుత స్థానంలోగూడావున్నాడు. పరిపాలనలో భాగముంది. అలాంటపుడు తనేంచేయాలి? ఒక కన్నీటి చుక్కనువిడిచి వెళ్లడం శ్రేయస్కరమనుకున్నాడు. ఉదయం కానీ బస్సులేదు. ఆ రాత్రి అరిచేత ప్రాణాలు పెట్టుకొని బడిలోనే పడుకున్నాడు. అర్ధరాత్రి సుమారు వందరాళ్లు పడ్డాయి. ఎలాగానో ప్రాణాలు చిక్కబట్టుకొని ఉదయం నంజప్పగారి దుర్భేద్యమైన కోటనుండి తప్పుకొని బయట పడ్డాడు. అతడు వెళ్లిన సాయంకాలమే ఐదారుమంది పోలీసులు వచ్చారు. రిపోర్టులో వ్రేలిముద్రలు పెట్టిన ముగ్గురు యువకుల యిండ్లపై దాడి చేశారు. పదిహేడు సారాబుడ్లు స్వాధీనం చేసుకొన్నారు. ఈ బుడ్లు నంజప్ప చేత స్వయంగా పంపి వారి పూరిపాకచూరుల్లో అక్షణానికి ముందే దాచబడినై. వాటిని అక్కడదాస్తున్నపుడు యింటిలోని ఆడవాళ్లు అడ్డురాకపోలేదు గానీ ఎఱ్ఱటోపీల భయం వెనక్కిలాగింది. ముగ్గురి వీపులు విమానంమ్రోత మ్రోగి పోయినవి. నంజప్ప పెట్టిన కోడి ఫలావుతిని అది జీర్ణం అయ్యేదాక బెల్టులు తీసుకొని ఆ ముగ్గురినీ చితగ్గొట్టారు. గ్రామమంతా ఆదృశ్యాన్ని చూచి ఆక్రోశించి పోయింది. కలిగినవారికి ఎదురునిలిచితే మిగిలేవి చెప్పుదెబ్బలే నన్నారు అనుభవజ్ఞులు.

ఆ మరునాడు పోస్తున్న గంజిగూడా ఆగిపోయింది. యిలాగా ఒక్కవారం రోజులు దొర్లిపోయినవి. ఆ మధ్య ఒకనాడుమాత్రం వరుసగా పదేను బానలుంచి ముప్పైశేర్లు నూకలుపోసి చాలా గట్టిగా గంజికాశారు. ఆ దినం యెవరో ముగ్గురు పెద్ద అధికార్లు వచ్చారు. నంజప్ప స్వయంగా ముంతను తీసుకొని అందరికీ గంజిపోశాడు. వచ్చిన అధికార్లు ఆశ్చర్య చకితులైనారు. ఆ మధ్యాహ్నం అధికార్లకు చాలా ఆడంబరంగా విందుజరిగింది. చుక్కలేని తెల్లని పొట్టేలు పిల్ల... చిన్న సంబావుల

పచ్చిబియ్యం...పులావు ఘుమఘుమలాడింది. కరణం మున్సబు నంజప్ప అధికార్లు సంతృప్తిగా తిన్నారు. ఇలాంటి విందులెన్నో చూశానుగానీ యింతరుచి కరంగా లేదని పెద్ద అధికారి సర్టిఫై చేశారు. "టైంచాలక పోయింది. లేకుంటే యింకా ఎన్నో చేశేవారమని ఎక్కువగా తిని కడుపు నొప్పితో బాధ పడుతూ పల్లకిలించాడు కరణం. కొవ్వుగలిగిన పిల్ల కొత్తపొట్టేలన్నాడు పొట్టను తడుముకుంటూ మున్సబు.

ఆ సాయంకాలం పెసరపప్పుతో తయారైన పోళీలు భోంచేశారు అధికార్లు. ఇక పనిముగిసిందని గర్వంతో అధికార్లను సాగనంపాడు నంజప్ప.

గంజిదొడ్డికి సంబంధించినంత వరకూ నంజప్ప చాలా బాగా వ్యవహరిస్తున్నాడని అభిప్రాయపడ్డారు అధికార్లు. కిట్టని వారంతా ఎన్నో చెబుతారని వాటిని పాటించక ప్రజాసేవచేయాలని చెప్పాడు పెద్ద అధికారి. చిత్తమంటూ తలసాడించాడు నంజప్ప.

మరుచటివారం నంజప్ప అధికార్లవద్దకు వెళ్లాడు. ఇస్తున్న రేషన్ చాలదని అందరిలోనూ ముందుబడి పోట్లాడాడు. పేదలకోసం ఎంతశ్రద్ధ! ఇతనికంటే ప్రజాసేవకుడు లేడనుకొన్నారు అక్కడ విన్నవారందరూ. త్రాగేవారు అరువందలై పోయారని వారికి రేషన్ రెండింతలు పెంచాలని పట్టుబట్టాడు. అధికార్లు ఈ దానకర్ణుని ఉపన్యాస పటిమకు మెచ్చుకొని రోజుకు 36 శేర్లు జొన్నలు; 9 శేర్లు బియ్యము; 8 శేర్లు గోధుమలు; 6 శేర్లు పెసలు; రెండుమణుగులు ఉల్లిపాయలు సప్లయి చేయించారు.

ఆ రోజునుండి నంజప్ప స్వయంగా ఒక పెద్ద అంగడి పెట్టించాడు. మూడింట ఒకభాగానికి మునసబు కరణాలు భాగస్వాములు. వర్తకం బాగానే జరుగుతున్నది. కరణంగారి తమ్ముడు అందులో నియుక్తుడైనాడు. అమ్మకం యెలావున్న సాయంకాలం కరణంగారి గృహంలో పోళీల సువాసన కమ్మగా వస్తుంటుంది. మున్సబుగారి వంటయింటి అలమారా నిండుకు ఉల్లిపాయలే. నంజప్పగారి ఇనప్పెట్టెలో మాత్రం ప్రతివారం మూడువందల పచ్చనోట్లు వెళ్లి విశ్రాంతి తీసుకుంటున్నవి;

రిపోర్టులో వ్రేలిముద్రలు వేసిన ముగ్గురు యువకులూ అదృష్టవంతులు. వారు సాహసించి వ్రేలిముద్రలు వేసినందుకు బెత్తందెబ్బలు తిన్నా యిప్పుడు జైల్లో కడుపునిండుగా సంకటి తింటున్నారు. ఆ సాహసానికిగూడా నోచుకోని వారికి అసలు గంజికూడా కరువైపోయింది.

ఇంతకూ నంజప్ప ఘరానావ్యక్తి. త్వరలో ఆయన జాతకంలో యం. ఎల్. ఏ అయ్యేయోగం వుందని ఎవరో కార్తాంతికుడు చెప్పాడట. అందుకోసం ఆయన అన్నివిధాలా ప్రయత్నిస్తున్నాడు. అదృష్టంవుంటే అతడు మంత్రిగూడా కావచ్చునేమో. ఆ ప్రజాసేవా భారాన్ని మోయడానికి చాలినంత బలంకావాలి. అందుకోసం వేలకొలది పీపాలగంజి త్రాగుతున్నాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన కడుపులో కృష్ణమూర్తిలాగా ప్రపంచాన్ని దాచుకున్నాడు. కొంచెం దూరదర్శిని సాయంతో చూచామంటే ఆయన కడుపులో ఎన్నోరోడ్లు పరుగిడుతుంటాయి. లెక్కలేని రోడ్లకంట్రాక్టరతడు. ఎన్నో చెరువులున్నాయి. మరెన్నో కుంటలున్నాయి. అలాంటి మహానాయకుడు ఆ గ్రామాధినేత! శ్మశానంలాంటి ఆ గ్రామాన్ని ఏలుతున్న పెనుభూతమతడు.

అతడెక్కడో వున్నాడనుకోవడం పొరబాటు. అతనికారు రయ్యిమని మన కళ్లముందే పోతున్నది. అతడు సామాన్యమైన వ్యక్తిగాదు. అనర్గళంగా వుపన్యసించగలడు. మొన్న మొన్ననే కరువు నివారణ కమిటీ సభ్యుడైనాడు. ఈ విషయం తెలిసిందే తన స్వగ్రామంలో మిగిలిన నాలుగు కుటుంబాలు కొంపలు విడిచి వలసలువెళ్లి పోయ్యారు. ఆయన ఘనత ఇంకెన్ని విధాలుగా సువాసనలను విరజిమ్మబోతున్నదో తెలియదుగానీ మళ్లీ ఏదో పేదవిద్యార్థులకోసం హాస్టలు పెట్టబోతున్నాడని ఒక పుకారు లేచింది.

ఎంతమట్టుకు నిజమోగదా!



అవరిండియావారి ''నాయిల్లు''లో గిరిజ

# ఊరడింపు

శ్రీమతి
గంటి కృష్ణవేణమ్మ

పగలుగతించె నల్లదిగో భానుడు గ్రుంకెను పశ్చిమాంబుధిన్
కవగొని మేగుచున్నయవి క్రమ్మరిగూళ్ళకు పక్షిసంతతుల్
దివి మొగమైన యాకమల దీనత వాల్చె శిరంబు దిక్కులన్
గవిసెను యంధకారమిక కాంతుడు వచ్చెడి యూరడిల్లుమా.

వాడిమయూఖుడల్లదిగో వ్రాలెను పశ్చిమకాంత కౌగిటన్
చేడియ నల్దెసల్ గవిసె చీకటులభ్రపదంబునందదే
పోడిమిమీర తారకలు పొల్చెడి నీప్రియుడింక చెచ్చెరన్
యీడకు వచ్చునూరడిలు మించుక నెమ్మది నమ్మనెచ్చెలీ.

సుంతయెడబాటుకే వగపింతయేల, - పవలుగడచని రేయిదే వచ్చుమరల
రేపవళ్ళును చక్రంబు రీతిగాదె - స్థిరమె కాలము చెలియ యస్థిరముగాదె.

కాలము వక్కరిసొమ్మా - బేలా; వగవంగరాదు పిరికితనమున్
వాలాయంబుగ నీకొక - కాలము రాగలదు వెలుగగలవు జగాన్.

నీవుమహాప్రతీవ్రతవు నిశ్చలచిత్తవు గాంచ నెప్పుడున్
నీవిభుదక్కనన్యుల ననింద్యచరిత్రవు గాకముద్వతీ
నీవిధమాతడెల్లరుగు నిశ్చలచిత్తము చంచలాత్మతో
భూవిభులెల్లరుంగుదురు భూరిమదాంధులు వారు నెచ్చెలీ.

విప్పవుమా సినకన్నులు - తప్పవునీవ్రత మొకింత తరుణులకెల్లన్
నొప్పగునాదర్శమునీ - చొప్పమహాగొప్ప దేను జూడకుముదిసీ.

చల్లనివాడు నీవిభుడు సర్వజనాదరణీయుడెంతొ నీ
యుల్లము పల్లవించునిక యుగ్మలియుమ్మలి కంబుమానుమా
యల్లదె తూర్పుకొండపయి నాతనిదివ్యపతాక కాంతులున్
దెల్లముగాగ దోచెడిని తీవ్రతరాగ మనంబు జూపెడిన్.

అడలకుమమ్మ, పూరడిలుమమ్మ కుముద్వతి నీవిభుండదే
వడివడినేగదెంచెగును. వాంఛలుదీర్చును క్రాగియుండునీ
బెడిదపువేదనాభరము ప్రీతినిశీథకరుండు మాన్పవ
చ్చెడిని దెపూర్వదిక్ సిఖరిచెన్నలరారె మనోజ్ఞకాంతులన్

కొంత మేలయింది. పదిరోజులదాకా జ్వరం తగ్గలేదు. మళ్ళీ యథాస్థితిలోకి వచ్చేటప్పటికి నెలరోజులు పట్టింది.

అప్పటినుండి చదువు గిదువు స్వస్తి వాచకాన్ని పఠించాయి. యశో నాదినచర్యలో పాల్గొంటున్నాడు. అతనికేవిధమైన కృతజ్ఞత చూపాలో నాకు తెలియటంలేదు. మనసులోనే ఆమువ్వురు మూర్తుల కనేకవేలనమస్కారాలను చేశాను. అంతకన్న చేయగలిగిందేముంది. యితరులకు ఎంతో జాలికలుగజేసే నాదీన హీనస్థితులు రక్తసంబంధం గలిన వారికి పట్టినప్పుడు అక్కడ ఎంతకాలముని వుండటం?

## ౪

కష్టాలు, దుఃఖాలు మనుష్యులను పలురకాల వ్యథల పాలుగావిస్తాయి. దుఃఖ మధిక మయినప్పుడు మనస్సు పరి పరివిధాల పోతుంది. దానికెక్కడా లంగరందదు. దుఃఖంలోనుండి కొందరు విరాగులౌతారు. అన్నీ నావి. యిది నాది. నువ్వు నేను అని అన్నీ తన కన్వయించుకున్నప్పుడు వాటి వల్ల ఎడతెగని సంబంధం ఏర్పడుతుంది. వాటివల్ల వచ్చేకష్టనష్టాలకు ఓర్చుకోవలసి వుంటుంది. ఎల్లప్పుడూ వాటినే వాంఛించటం వల్ల మనస్సుకు విశ్రాంతి వుండదు. ఆలోచనలు అధికమై మనస్సు పరితాపం పొందుతుంది. దుఃఖాలవల్ల ఒక్కొక్కప్పుడు హృదయానికి తీరనిలోటు, మాయని గాయం ఏర్పడుతుంది. ఆ అవస్థలో నుండే వైరాగ్యదశలోకి ప్రవేశించుతారు కొందరు. యీదశ ఎవరో మహానుభావులకు తప్ప అందరికీ సాధ్య పడదు. అప్పుడు ఏవీ తనవి కావని, తాను తానే కాదని అంతా భగవంతుని స్వరూపమని భావిస్తాడు. అంతా మిథ్య అంటాడు. భార్య పిల్లలు యిత్యాది సంబంధాలన్నీ సాగరాన్ని యీదే మత్స్యాన్ని వల వేసి బంధించే సాధకాలని తలుస్తాడు. నిత్యానందం, స్వర్గ సౌఖ్యం అంతా భగవద్ధ్యానంలోనే లీనమై వుంటుందని భావిస్తాడు. అప్పుడతని భక్తి ప్రపత్తులు జీవితసాగరాన్ని దాటింప చేస్తాయి, ప్రశాంతమైన జీవితం గడుపుతాడు. 'ఇది నాది కాద' ని విడిచినప్పుడు మళ్ళీదాన్ని ఆపేక్షించి దానికోసం ఆరాట పడకుండా వుండగలగటమే వైరాగ్యంలోని ముఖ్యవిషయం. విషయవాంఛలను వీడి విశ్వమంతా తేజోమయుని స్వరూపంగా భావించి ధ్యానిస్తూ జీవితశేషం వెళ్ళబుచ్చుతాడాతడు. ఇటువంటి కష్టతరమైన వైరాగ్యాన్ని సాధించటం సామాన్యులకసాధ్యం; అందని విషయం. జీవితంలో భరింపరాని బాధలు కల్గినప్పుడు కొందరు వాటినుండి తప్పించుకుని దూరంగా పోవాలని యత్నిస్తారు. అందువల్ల స్వస్థానం వదిలి దేశాలపాలౌతారు. ఒకచోట గూడా మనస్సు స్థిరంగా నిలవక అనేక రకాల బాధలకు గురౌతారు. 'కష్టాలు కల కాలం కాపురముంటాయా!' అంటారు. కాని కొన్ని జీవితాలు శోధిస్తే పుట్టిన దగ్గర్నుంచి గిట్టేదాకా కష్టాలతోటే సరిపోతుంది. ఒక కష్టాన్ని గట్టెక్కటానికని పారిపోయి యింకొకచోట మరొక యిక్కట్టుకు గురౌతుంటాడు. ఒకచోట గూడా స్థిరచిత్తం లేక చంచలంగా గాలికి తిరుగుతుంటాడు. ఆజీవికి విశ్రాంతి అనేది వుండదు. కష్టాల కెదురీద తలుస్తాడు. కాని అవి అతన్ని నిలవద్రొక్కుకో నీయవు. పరాజితుడిని చేస్తాయి. చివరకు చాల వ్యథలకు లోనై జీవితాన్ని చాలిస్తాడు. యిటువంటి జీవులకు సుఖమనే దేమిటో తెలియదు. అనాథులై అస్థిర చిత్తాలతో, అంధులుగా అలమటించి అంతమొందుతారు. ఎక్కడా నిలువ ద్రొక్కుకోలేక పోవటం వల్ల వాళ్ళకు మనశ్శాంతి వుండదు. వచ్చిన కష్టాన్ని ఎదుర్కొనే శక్తి వారిలో లేదు. జీవితం దుఃఖభాజనం చేసుకుంటారు యిలాంటి వారంతా చేతులార! కొందరు కర్మ సాధారంగా తీసుకొని తలవ్రాసిన వ్రాత అంటూ అందులోనే మునిగి తేల్తుంటారు. అలాంటి వారికి కల్గిన మనో నిశ్చయాలలో లోపల క్రుంగదీసి జీవితాలను బలిగొంటాయి. 'నుదుట వ్రాసిన వ్రాత తప్పదు నూరేండ్లకైన' అని జీవితాలను కష్టపరం పరలకు లోను గావించి అనుభవిస్తారు. కష్టాలలో గూడా అవమానం కలుగజేసే విషయాలలో అతనిహృదయం మరీ నీచపరిణామము పొందుతుంది. అవమానంతో

క్రుంగిపోయే హృదయం కలకాలం ఆశతో వుండటం అసంభవం. అవమానితులు తమజీవితాలను బలి చేస్తారు. లోకులు కాకుల్లాగా పొడుస్తుంటారని అవమానితుడు ఆత్మహత్యకు పాల్పడతాడు. దుఃఖాన్ని తట్టుకోలేక శాశ్వతమైన శాంత ప్రకృతిని ఆశిస్తూ మృత్యువాతతడు పడతాడు. చేతులతో నిండు ప్రాణాన్ని తీసుకుంటాడు. పలురకాలుగా కష్టాలు మానవుల జీవితాలను బలిగొంటాయి.

◆ ◆ ◆

బడిచాలించిన దగ్గర్నుంచీ గొడ్లను కాయటం అలవాటయింది. ప్రొద్దున్నే చద్దిమెతుకులు తిని గొడ్లను దూరంగా అడవిలోకి తోలుకుపోవాలి. ప్రొద్దుగూకంగానే తోలుకు రావాలి. వాటిచాకిరీ అంతా చేసి ఏ అర్ధరాత్రికో మేనువాల్చేవాడిని.

ఒకరోజు గొడ్లను మేపుతుంటే తల్లిగొడ్డు ఒకటి తన బిడ్డకు పాలు గుడుపుకుంది. ఇది నేనుచూడలేదు. ఘంటికి వచ్చిం తర్వాత పాలుతీయబోతే అది తన్నింది. మళ్లీ గ్రంధం మొదలయింది.

'ఏం గాడిదలు కాస్తున్నావురా! దూడ పాలు తాగుతుంటే చూస్తూ వూరుకున్నావ్! యిట్లా ఐతే పొట్ట పగిలేట్టు పోసుకు తాగటానికెక్కడినుంచి స్తాయి!' అని అత్త బెత్తానికి పనిగల్పించింది. నోరు లేని జంతువునే నేనుగూడా! నేను జాలిగా ఆ ఆవు కళ్ళల్లోకి చూశాను. అది 'నాబిడ్డకు నేను పాలు కుడుపుకుంటే తప్పా!' అన్నట్లు చూసింది. నేనేం చెప్పను.

ప్రతిరోజూ యశోధర్‌ను గూడా నాతో అడవికి తీసుకు పోతుండేవాడిని. అక్కడ చెట్లెక్కి పండ్లు కోసుకుంటూ, పరుగెత్తుతూ కాలం గడిపేవాళ్ళం. యశో మధ్యాహ్నం పూట చెట్టుక్రింద కూర్చొని వేణువును వూదుతుండేవాడు. ఆ ఆలాపనవిని శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవి వూదుతుంటే మోరలెత్తి ఆలకించే గోవుల్లాగా యీజంతువులు గూడా ఆలకిస్తుండేవి. అతని వేణుగానం వింటూంటే నేను ఏదో స్వర్గలోకంలో విహరిస్తున్నట్లుంటుంది. అనిర్వచనీయానందాబ్ధిలో మునకలేస్తున్నట్లనిపిస్తుంది. ఇటువంటి సంగీతంలో ఎంతమాధుర్యం వుందో అని ఆలోచిస్తూ ఎల్లప్పుడూ యిలాగు వుండిపోతే బాగుండు ననిపించేది!

ఆరోజు నేను గొడ్లను విప్పి పొలానికి బయలుదేరాను. ప్రతిరోజూ వెళ్ళేటప్పుడు యశోను కేక వేసి వెంటబెట్టుకు వెళ్ళేవాడిని. మామూలుప్రకారం వాళ్ళింటి ముందాగి 'యశోధర్!' అని కేకవేశాను. సమాధానం రాలేదు. పిలచినప్పుడు 'వస్తున్నాననో' 'నువ్వేరా!' అనో వినబడేది. మళ్లీ కేక వేశాను 'అన్నాయ్!' అని.

అభయ బైటికొచ్చి నన్నుచూచి 'నువ్వా! యశోను పనిమీద వూరికి పంపించాను. యివాళ రాడు; రేపువస్తాడులే నాయనా!' అంది.

నామనసులో ఏదో మెరపు మెరసి మాయమైంది. సరేనని నేనొక్కడినీ గొడ్లను తోలుకొని బయలుదేరి పోతున్నాను నిర్జనబయలు ప్రదేశం గుండా!

ఈరోజు యశోధర్ లేనిలోటు ఎక్కువగా కనిపించింది. అతడుంటే ఎంతో వుత్సాహంగా గంతులు వేసుకుంటూ పోయేవాడిని, నేను నిరుత్సాహం నాలో ప్రవేశించింది. ఏమిచెయ్యటానికి పాలుపోవటం లేదు. తలవంచుకొని ఏదో ఆలోచిస్తూ పోతున్నాను. అతని వేణుగానం వినేభాగ్యం నాకు లేకపోయింది. గొడ్లు బయలుమేస్తున్నాయి. నాకు వాటివైపు ధ్యాసపోలేదు. అవి ఏం చేస్తున్నదీ గమనించకుండా వున్నాను. ఎందుకో నన్ను దుఃఖం ఆవరించింది. తెలియని ఆవేదన నాలో ప్రవేశించింది. బిగ్గరగా ఏడ్చాను. అరణ్యంలో నారోదన ఎవరికోసరం! ఏమో! అనేక రకాల ఊహలు నాలో మెరపు మెరసినట్లు మెరిసి మాయమై పోయినై. యశోధరును యింక చూస్తానో లేదో! యీ ఊహ నన్ను మరింత బాధించ సాగింది. మాకు స్నేహం కలిసినదగ్గర్నుంచి ఒక్కరోజుగూడా మేము విడిచివుండ లేదు. ఈనాడిలా సంభవించింది. నాదీనావస్థనంతటినీ

నెమరువేసుకుంటూ కూర్చున్నాను. అలా ఎంత కాలం వున్నానో! నిద్రాదేవత నాహ్వానించాను. ఆమె దయతో నన్ను తన కౌగిలిలోకి తీసుకొని జోకొట్టింది. మధుర స్వప్నాలను కొన్నింటిని కన్నాను. ఒకచోట మా అమ్మవచ్చి నన్నెత్తుకొని ముద్దుపెట్టుకున్నట్లు కలగన్నాను. నిజంగా యీ నిర్భాగ్యుడికి అంత అదృష్టం గూడానా! నా అత్త దయ్యమై పీక్కు తింటానికి వచ్చినట్టుంది. ఆభీకరాకారం చూచి భయపడ్డాను. వణికిపోయాను. దగ్గరికి వస్తున్నది. భీతితో లేచి పరుగెత్తాను. అడవిలో చెట్ల సందుగుండా పరుగెత్తుతుంటే ఒకచోట చెట్టుకొట్టుకొని క్రింద పడ్డాను. 'అబ్బా!' అని వులిక్కిపడి లేచాను.

అంతా గాఢాంధకారం. ఎక్కడా ఏమీ కనబడటం లేదు. రాత్రయిందని తెలుసుకున్నాను. పశువులేమై వుంటాయి! వాటికి యింటి త్రోవ తెలుసు, వెళ్లుంటాయనుకున్నాను. యిప్పుడీ చీకట్లో యింటికేవిధంగా పోవాలని ఆలోచనలో పడ్డాను. నా మనసెదురు తిరిగింది. ఇంటికి పోగూడదనుకున్నాను. ఏవిధాన్నైనా బ్రతకాలనుకున్నాను. వాళ్లకు చేసేచాకిరీ ఏపుణ్యాత్ములకైనా చేస్తే ఫలితం వుంటుందని యింటికి వెళ్లాలనే ప్రయత్నం మానేశాను. నా వారికి చెప్పకుండా వెళ్తున్నందుకు అనేక నమస్కారాలుచేసి క్షమించమని ప్రార్థించాను. ఇంక ఆయింట్లో నికృష్టపు జీవితం భరించటం అసంభవమని తలచాను.

ఈ అర్ధరాత్రప్పుడు ఎక్కడికి పోవాలో తోచ లేదు. ఆకలి మండిపోతూంది. ఎక్కడా దారికనబడటం లేదు. చెట్లను కొట్టుకుంటూ వాటిమధ్యలో నుంచి బయటపడ్డాను. బయలు ప్రదేశం వచ్చింది. యింటిదారి వదిలి వేరేత్రోవ తీశాను.

ఇంతరాత్రప్పుడు ఒంటరిగా అడవి ప్రాంతంలో ఎప్పుడూ ప్రయాణం చేయలేదు. అయినా బ్రతుకు మీది ఆశాభావం నన్ను ముందుకు లాక్కుపోతున్నది. కాళ్ళల్లో శక్తి వున్నంతవరకూ నడుస్తూనే వున్నాను. అకస్మాత్తుగా యశోధరు చెప్పినమాటలు గుర్తుకొచ్చాయి. 'దయ్యాలు మనుష్యులను వెంబడించి తీసుకుపోయి ఎక్కడో పడేస్తాయి! ఏమేమో చేస్తాయి!'

నేనాగిపోయాను. ఒంటరి వాడిని. అరణ్యప్రాంతం. కటికి చీకటి. యశో మాటలు నన్ను మరీ భయస్తుడిని చేసినై. నా కాసమయంలో ధైర్యం చెప్పేవాళ్ళెవరున్నారు? నాలో నేనే ఊరడిల్లాను. చచ్చినా ఆదయ్యాల చేతుల్లో చద్దాం. అక్కడ వాళ్లు పెట్టేబాధకన్న యిదే నయమనే మొండిధైర్యం అవలంబించి మళ్లీ నడకసాగించాను. కొద్దిదూరం పోయి వెనక్కు తిరిగి చూచాను. ఏమీ లేదు. కొంతదూరం నడిచాను. ప్రక్కన ఏదో గలగలమని శబ్దం వినిపించింది. పామేదైనా పోతున్నదేమో ననుకున్నాను. కాని దయ్యమేమోనని అనుమానం కలిగింది. వెనక్కు తిరిగి చూచాను. ఏమీ కనబడలేదు. దయ్యాలు క్రింద నడవ్వని యశో చెప్పాడు. ఆమాట గుర్తుచెప్పకొని దయ్యం మాత్రం కాదని నిశ్చయించుకొని ముందుకు పడి పోతున్నాను.

ఎక్కడనుంచో సన్నని వెలుగు కనిపిస్తూంది! దగ్గరికి వెళ్లాను. ఎఱ్ఱగా మండుతూంది ఏమిటో. కొరివిదయ్యాలుంటాయని విన్నాను. యివి కొరివి దయ్యాలనుకున్నాను. అవి మనుష్యులను పట్టి పీక్కు తింటాయట. గుండె దడదడ కొట్టుకుంది. పరుగెత్తాను కొంతదూరం. వెనక్కు తిరిగిచూస్తే అది అక్కడే వుంది. కొరివిదయ్యాలైతే మనుష్యులను వెంబడించి పీక్కుతింటాయట, నానా బాధలు పెడతాయట. యీసంగతులన్నీ యశోధర్ దగ్గర విన్నాను. అదికాదేమో ననుకున్నాను. మళ్ళీ దాని వైపు నడకసాగించాను. దగ్గరికి వెళ్ళేటప్పటికి ఒక శవం మండటం చూశాను. నాభయం కొంతవరకు తీరింది. శవాలను పీక్కుతింటానికని నక్కలు మొదలైనవి వస్తాయంటారు. కాని అవ్వేమి అక్కడలేవు. శ్మశానంలో అర్ధరాత్రి సమయంలో భూతప్రేతాలు దయ్యాలు నాట్యం చేస్తుంటాయని వాటి మాటలు గూడా వినబడతాయని అంటారు. కాని నిప్పుచూస్తే యివన్నీ భయపడి పోతాయిగదా అని అవిరాకుండా

అక్కడే ఆరాత్రి గడుపుదామనుకున్నాను. కొంత సేపు మనసు బిగబట్టి కూర్చున్నాను.

ప్రొద్దుటి నుండీ అన్నం నీళ్లూ లేవు. ఆకలి దహించుకు పోతున్నది. నాలికెండు తున్నది. ఇలా కూర్చోలేనని మళ్ళీ నడక సాగించాను అడవిలో మనుష్యులుగాని యిళ్ళుగాని కనిపిస్తాయేమోనని ప్రాణాలు కాపాడుకుంటే తర్వాత సంగతి తర్వాత ఆలోచిద్దామనుకున్నాను. శ్మశానవాటికలో శ్మశాన వైరాగ్యం అనుభవించాను కొంతసేపు.

◆ ◆ ◆

వైరాగ్యం మూడువిధాలు- ప్రసూతి వైరాగ్యం, భక్తివైరాగ్యం, శ్మశాన వైరాగ్యం అని. మొదటిది స్త్రీలకు సహజం, దాన్ని విపులీకరించ నక్కర్లేదు. రెండవరకం సామాన్యంగా హరికథలు పురాణ గాథలు, భక్తుల చరిత్రాలు వింటున్నప్పుడు భక్తి పరవశులై ఆదేవుడిలో లీనమైపోయినట్లు, యీ జగత్తుతో తనకు ఏమీ సంబంధం లేనట్లు వైరాగ్యం అనుభవిస్తారు. అది అక్షణకాలం మాత్రమే. దీన్ని భక్తి వైరాగ్యం అంటారు. బంధువులో, ఆప్తులో, స్నేహితులో చనిపోయినప్పుడు మృత్యువు గుర్తుకొచ్చి 'ఎవరైనా ఏనాటికైనా మృత్యుగహ్వరాన్ని ప్రవేశించ వలసిన వాళ్ళమేగదా! ఎందుకీపాడు తనువు! బ్రతికినన్ని రోజులు జీవికీ ఆరాటం తప్ప విశ్రాంతి అనేది వుండదు! యీ శ్మశానం శాంతికి నిలయం. ఎంతకాలం జీవించినా చివరకి మట్టిలో కలిసి పోయేవారమే! "మట్టిలోనబుట్టి మట్టిలోన పెరిగి, మట్టిలోన గిట్టుమనుజరూపు శాశ్వతంబు గాదు శతజన్మములకైన!" అని అనుకుంటూ విరాగులౌతారు. దీన్ని శ్మశాన వైరాగ్యం అంటారు. జీవితంలో యీ వైరాగ్య సముదాయం నిలకడగా స్థానం ఆక్రమించుకోలేవు. అందువల్లనే ఆయా భావాలు వచ్చినప్పుడే క్షణకాలం మాత్రం ఆయా వైరాగ్య దశల్లోకి పోతారు. అంతే మళ్ళీ యథాస్థితిలోకి వస్తారు. ఆ వైరాగ్యస్థితి అలాగేవుండి స్థిరచిత్తంతో అనుభవించే వాళ్లు ఏశతకోట్లలో ఒక్కడుంటాడు. అతడే మహాపురుషుడు, త్యాగి, ధర్మి! అతడే భగవత్స్వరూపం తెలుసుకో గలుగుతాడు. ఈ వైరాగ్య దశలు గూడా మనుజుని జీవితంలో అవసరం. జీవితంలో సౌఖ్యం ఎంత అవసరమో దుఃఖం, వైరాగ్యం గూడా అంత అవసరం. దుఃఖితులు శ్మశానవైరాగ్యం ఎక్కువగా అనుభవిస్తుంటారు. అప్పుడు వారి మనస్సులు కొంత కలత దేరుతాయి. క్రమంగా దీనిమూలకంగా దుఃఖోపశమనం కలుగుతుంది. దుఃఖసముద్రాన్ని యీదటానికి భక్తి శ్మశాన వైరాగ్యాలు నావలుగా ఉపయోగిస్తాయి. కాని కొందరు వాటిని తెలుసుకోలేక దాటటానికి బదులు అందులో మునిగి పోతారు. ఇదందరికీ సాధ్యం కాదు. ప్రయత్నిస్తే జరగని పనిలేదు. స్థిరచిత్తుల కైనా సాధ్యమౌతుంది. చంచలచిత్తుల కెక్కడా ఎప్పుడూ శాంతి లభ్యం గాదు.

ఆనాడు యశోధర్ నేనూ కలసి వెళ్లినప్పుడు జరిగిన సంఘటన నాకు బాగా గుర్తు, నేటికీ కళ్ళకు కట్టినట్లుంది. యశో, నేనూ వెన్నెలరాత్రుల్లో కాలవ మీద ప్రయాణం చేసే వాళ్ళం. ఆనాడా తడు నన్ను తీసుకువెళ్ళాడు. కొయ్యచెక్కలతో చిన్న తెప్ప తయారు చేశాడు యశో. అది మాయిద్దరికీ కాలవమీద వాహకంగా వుపయోగపడేది. యిద్దరమూ కలసి తెప్ప ఎక్కాము. ప్రవాహం అనుకూలంగా వుండటం మూలకంగా తెప్పదానంతటది నీటిమీద తేలిపోతున్నది. సువాసనా పూరితమైన గాలివీస్తూ నావను కదిలిస్తున్నది. మేమిద్దరం హాయిగా నీటిమీద ఉయ్యాల లూగుతున్నాము. యశో ముక్కానీపట్టాడు. చంద్రకాంతుల్లో మిలమిల మెరుస్తూ, గాలిచే అలలలుగా వస్తూ, తెప్పకు తగిలి యథారూపాన్ని పొందుతున్న స్వచ్ఛమైన నీటికాంతుల్ని తేరిపార జూస్తున్నానునేను. చల్లని వెన్నెల్లో, నిశ్శబ్దమైన వాతావరణంలో నేనూ నాభ్రాత, జల తరంగాలపై తేలియాడుతూ పోతున్న చిరుతెప్ప మీద ఒంటరిగా మేనుల్లు మరచి ప్రయాణం చేస్తున్నాము. నేనీలోకంలో లేను. ఏవిస్వ్థిలో విహారం

(సశేషము)

# స్త్రీ సమస్యలు



## అమెరికాలోని కుటుంబ జీవితము

శ్రీమతి ముదునూరి జానకి

నేటికి మనదేశం ఉన్నతస్థితికి వచ్చినదంటే మహాత్మాగాంధీ, శ్రీ నెహ్రూ మున్నగు పెద్దలే కారణములని మనకందరికి తెలిసిన విషయమే. ఒకదేశం ముందుకు రావాలంటే ముందు ఆదేశంలోని ప్రజలు, వారి పద్ధతులు, మొదలగునవి మారితే, దేశం, అదంతట అదే మారిపోతుంది. ఇతర దేశములలో మాదిరి మనదేశంలోకూడా స్త్రీలు నేడు, పురుషులకంటేకూడా, రాజకీయ విషయాల్లో పాల్గొని, దేశసేవకై పాటుబడుచున్నారు. కాబట్టి మనదేశం యింకా అన్నిదేశాలకంటేకూడా బాగుపడాలంటే మనమంతా (ముఖ్యంగా స్త్రీలు) కష్టపడి, యితరదేశాల స్త్రీలు, వారి బాధ్యతలు మొదలగు వానిని పత్రికల ద్వారాచదివి అవి అవలంభించి నేర్చుకొని, యితరులకు బోధించి, అందరుకలిసి దేశంకొఱకు పాటుబడి, శ్రద్ధతో పనిచేస్తే, అప్పుడే మనదేశం బాగుపడగలదని నేనేకాదు, మనదేశ నాయకులు దినదినమూ మనకు బోధిస్తూనేయున్నారు.

నేటి దేశాలన్నిటిలోకి వున్నతస్థానం పొందినది అమెరికా. కొన్ని ఏండ్లకు పూర్వము ఈదేశంకూడా చాలా హీనస్థితిలోవుండేది. ఇప్పుడు, అన్నిదేశాలలో ముందడుగు వేస్తూవున్నదని, ఆదేశంలోని ప్రజలే కారణమని వేరేచెప్పనక్కరలేదు. అమెరికాలోని స్త్రీలు చాలా కష్టపడతారు. ఒక కుటుంబములోని స్త్రీవుందిఅంటే, ఆమె తనగృహము చూసుకొనుటయే కాకుండా, యితరులకుకూడా తగినంత సహాయంచేస్తుంది. భార్యాభర్తలిద్దరూ కూడా చాలా కష్టపడతారు.

అమెరికన్ స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూకూడా చాలా ఖులాసాగా జీవితం గడుపుతారు. విచారమనేదేలేకుండా, ఎప్పుడూ చేతినిండా పనితోవుంటూవుంటారు. ప్రతి పండగకు చుట్టములు, స్నేహితులు అంతాకలిసి సరదాగా కాలక్షేపంచేసి, వనభోజనాలుచేసి, ఎవరియిండ్లకువారు సంతోషంగా చేరుకుంటారు. అమెరికన్ పిల్లలుకూడా తల్లితండ్రులకు మల్లే, వారుకూడా కష్టపడతారు. తల్లికి సహాయంగా పిల్లలు ఎంతోపని ముఖ్యంగా యింటికి కావలసినవస్తువులు, కూరలు, వంట, మొదలయిన పనులన్నియుచేసి, తల్లికి ఎంతో

సహాయంచేస్తారు. ఈవిధంగా, ఎన్నో అమెరికన్ కుటుంబాలు వారి ఇంట్లనే చక్క పెట్టుకొనుటయే కాకుండా, ఇతర కుటుంబాలకుకూడా సహాయంచేస్తారు.

అమెరికాలోని స్త్రీలు కాలం ఎట్లా గడుపుతారు, ఏవిధంగా సంసారం నడుపుతారని కొంచం ఆలోచిద్దాం.

అమెరికన్ స్త్రీ తన యింటిపనులు తానే స్వయంగా చేసుకుంటుంది. సాధారణంగా అమెరికనులు, నౌకర్లను పెట్టుకోరట. వారే స్వయంగా అన్నిపనులూ చేసుకొని భార్యాభర్త బిడ్డలు సంతోషంగావుంటారు. 'సంతోషం సగంబలం అన్నట్లు' సంతోషంతో జీవితంగడిపితే దేహబలం వృద్ధిఅవుతుంది. స్త్రీ తానే స్వయంగా విరామంగా వుండేటప్పుడు ఇంటికి కావలసిన కూరల తోట (Kitchen garden) వేస్తుంది. పిల్లలకు కూడా తోటపని, కుట్టు, అల్లికలు, అనేక విధములైన చేతిపనులు నేర్పుతుంది. సామాన్యకుటుంబాలలోని స్త్రీలు, తాముచేసిన పనులను, బజారులలో అమ్మి డబ్బుసంపాదిస్తారు.

ఇంక పరోపకారం గురించి ఆలోచిద్దాం. ఎక్కడైనా ఇరుగుపొరుగు వారిలో ఎవరికైనా జబ్బుచేస్తే స్నేహితులే వారికి సహాయంచేస్తారు. ఈవిధంగా తగిన చికిత్స చేయుటకుగాను అందరూకలిసి స్వయంగా చిన్నఆసుపత్రులు, నర్సింగ్‌గృహాలు, కట్టి స్నేహితులే కొంతమంది వైద్యులుగావున్నవారు, యితరులకు సహాయం చేస్తారు. స్త్రీలుకూడా అనేకపనులుచేసి పురుషునివలెనే సంపాదిస్తారు.

పిల్లలకు యీవిధంగానే పెద్దలు బడులలో చేర్చి, మంచిబుద్ధులు నేర్పుతారు. పిల్లలను అన్నిఊర్లుతిప్పి అన్నివిషయాలు బోధించి దేశపరిస్థితులలో వారినికూడా పాల్గొనేటట్లుగా పెద్దలు వారికి తగినశిక్షణ యిస్తారు.

ఈవిధంగా అమెరికాలోని ప్రతికుటుంబముకూడా, తాము సుఖంగావుండటమే కాకుండా, యితరులనుకూడా సుఖంగా వుండేటట్లు చేస్తారు.

కాబట్టి మనంకూడా (స్త్రీలంతా) కలిసి మనదేశానికి స్వతంత్రంకూడావచ్చింది కాబట్టి కష్టపడి, ఇతరదేశస్త్రీలమాదిరి, దేశసేవకై పాటుబడి, మన దేశాన్నికూడా అమెరికావలె చేయాలని చేయగలరని, స్త్రీలకు సహాయంగా ఈవ్యాసం అందజేయగలుగుతున్నందుకు చాలా సంతోషపడుచున్నాను. మీరంతాకూడా, 'దేశంఅంటే మట్టికాదోయి దేశంఅంటే మనుష్యులోయి' అన్నసంగతి మరువరని ఆశిస్తున్నాను.

# శాస్త్రీయ హిందుస్థానీ సంగీతము-దాని ఉత్పత్తి

శ్రీమతి వంగల వాణీబాయి



ఉత్తరదేశపు సంగీతమన్న మనవాళ్లు చెవికోసు కొంటారు. దూరపుకొండలు నునుపు అన్నసామెత నిజమే. నిజానికి మన కర్ణాటక సంగీతములోనున్న శాస్త్రీయము, కట్టు, వారి సంగీతములోలేదు, కాని హిందుస్థానీ సంగీతములో ఒక చక్కని కోమలత హాయి ఉన్నదన్న మాటలో సందేహములేదు. సంగీతమనేది చిరకాలాన్నించీ తరతరాలుగా వస్తోంది. సంగీతాన్నిగురించిన గొప్పగొప్ప గ్రంథాలువ్రాసిన కవులు చాలామట్టుకు మనవాళ్ళే.

హిందుస్థానీ సంగీతము వేదకాలంనుంచీ కొద్దీ గొప్పో ఉన్నప్పటికీ, పండితులు దాన్ని శ్లోకరూపంగానే ఉచ్చరించేవారనీ, కట్టుగా శాస్త్రీయ సంగీతరూపంగా హిందూరాజ్యంలో ఏహిందూ మహారాజులూ సంగీతాన్ని హెచ్చరించి వృద్ధిలోకి తీసుకురాలేదనీ గ్రంథాలవల్ల మనకు తెలుస్తోంది. వేదకాలంలో 4 వ శతాబ్దములో భరతపండితులు వ్రాసిన నాట్యశాస్త్రంఅనే గ్రంథంతప్ప వేరుగా చెప్పతగిన మరి ఇతర గ్రంథాలేమీ కాన్పించలేదు. కాబట్టి మనం ప్రస్తుతం, దేశచరిత్రలోని హిందూ రాజ్యాన్ని వదిలేసి, ముసల్మాన్ పాలన సమయాన్నించీ చర్చిద్దాము.

Capt. డే. గారు వ్రాసిన "music of Southern India" అనే గ్రంథంవల్ల మనకు తెలిసిందేమంటే, ముసల్మాను రాజ్యానికి పూర్వం, హిందూపాలన కాలంలో హిందూదేశ మంతటనూ సంగీతమనేది, అనగా, గానము, వాద్యము, నాట్యము, ఒకే మాదిరిగా ఉండేదనీ, ముసల్మాన్లు రావడంతోనే ఈ కళ చాలా భాగము నశించిపోయిందనీ, సంగీతం యొక్క పునాదినిగురించి వ్రాయబడ్డ గ్రంథాలుకూడా చాలా పోయినాయనీ - అప్పటికీ ఈగందరగోళాలు దక్షిణహిందూస్థాన్‌లో అంతగా జరగకపోబట్టి దక్షిణదేశస్థులు వారికళలను చాలా మట్టుకు నిలబెట్టుకోగల్గారనీ తెలుస్తోంది. 12 వ శతాబ్దంలో వ్రాయబడ్డ జయదేవకీర్తనలు మాత్రం మిగిలాయి.

ఉత్తర హిందూదేశంలో మొఘల్ సామ్రాజ్యంలో; లోచనకవి అనే పండితులు వ్రాసిన "రాగతరంగిణి" అనే గ్రంథము ద్వారాకూడా రాగలక్షణాలు, మేళకర్తలు, మొదలైనవి కొన్ని తెలుస్తున్నాయి. లోచనకవి వ్రాసిన కొన్ని శ్లోకాల్లో పూర్వం 16000 రాగాలు ఉండేవనీ, గోపికలు శ్రీకృష్ణుని దగ్గర పాడేవారనీకూడా తెలుస్తోంది.

తిరిగి షుమారు 1300 శతాబ్దంలో సుల్తాన్ అల్లా ఉద్దీన్ పరిపాలనలో సంగీతము బాగా వృద్ధిలోకి వచ్చింది. కాని ఇంతకుపూర్వమే మన హిందూ గ్రంథాలన్నీ నశింపచేయబట్టే, ఈ నవాబులు ఎక్కువగా వాళ్లవాళ్లనే ప్రోత్సాహపరుస్తూ ఉండబట్టే, ఉత్తరదేశపు సంగీతములో మార్పు ఏర్పడ్డది.

ఈ నవాబు కాలంలోనే పర్షియన్ విద్వాంసుడు అమీర్ ఖుస్రూ అనే ఆయన చాలా మార్పులు ఏర్పరిచినాడనీ, కొన్ని క్రొత్తరాగాలు "జిలాఫ్‌రాగం" "సాజగిరిరాగం" "సర్పర్దారాగం" - మొదలైన కొన్ని పర్షియన్ రాగాలు పాడుతూ ఉండేవాడని తెలుస్తోంది.

ఒకసారి గోపాలనాయకులు అనే ఒక గొప్ప దక్షిణాది విద్వాంసుడు ఢిల్లీకి ఆహ్వానింపబడ్డట్టు అక్కడ సుల్తాన్ అల్లా ఉద్దీన్ సమక్షంలో గోపాలనాయకులకీ, అమీర్ ఖుస్రూకీ, పాటలోనూ సంగీతజ్ఞానములోనూ పెద్ద పోటీ అయినట్లూ అందులో గోపాలనాయకులే ఓడిపోయినట్లూ కూడా తెలుస్తోంది. కాని అసలు గోపాలనాయకులు ఈ పోటీకి ఢిల్లీ వెళ్లాడా లేదా అనే విషయంలో వాదవివాదాలు ఏర్పడ్డాయి.

సుల్తాన్ అల్లాఉద్దీన్ క్రీ॥ శ॥ 1294 లో దక్షిణ హిందుస్థాన్ మీదకి దాడి వెడలినప్పుడు సుల్తాన్ యొక్క 'జనరల్' అయిన మాలిక్ కఫూర్ అనే ఆయన దక్షిణాదినుంచీ పండితులనూ, గాయకులనూ, బ్రాహ్మణులనూ, విద్వాంసులనూ కొంతమందిని వారితో కూడా ఢిల్లీ కి తీసుకువచ్చి వారి ఆస్థానంలోనే ఉంచేసుకొన్నారని కూడా . రాజా Sri S. M. టాగోర్ అనే ఆయన వ్రాసిన "History of universal music" (P. 54) లో తెలుస్తున్నది. కాబట్టి గోపాలనాయకులు కూడా ఆ విధంగా తేబడిన వాళ్లలో ఒకరైన గొప్ప విద్వాంసుడై యుండవచ్చు. Capt. Williard అనే ఆయన "music of Hindusthan అనే గ్రంథంలో . సుల్తాన్ అల్లాఉద్దీన్. గోపాలనాయకుల్ని మోసంచేత ఓడిపోయే టట్లు చేశాడనీ, అమీర్ ఖుస్రూ తన వాడని గెలిపించాడనీ తెలుస్తోంది.

షుమారు ఈ సమయంలోనే అనగా క్రీ॥ శ॥ 13వందల శతాబ్దిలోనే, శార్ఙదేవులు, "సంగీతరత్నాకర్" అనే అమూల్యగ్రంథాన్ని వ్రాశారు. పండిత శార్ఙదేవులు అసలు కాశ్మీరవాసి అనీ. వారితాత, ముత్తాతలు ఏలనో ఈ దేశానికి వచ్చి ఇక్కడనే ఉండిపోయారనీ, శార్ఙదేవులు వ్రాసిన శ్లోకాలవల్లనే తెలుస్తోంది. వీరితాత దేవగిరి సంస్థానంలో పండితులుగా ఉంటూ ఉండేవారట. తరువాత షుమారు 1500 శతాబ్దిలో రామ అమాత్యాయ అనే ఆయన "సర్వమేళకళానిధి" అనే గ్రంథం వ్రాసినట్లు తెలుస్తోంది. తరువాత 1660 శతాబ్దిలో పండిట్ వెంకటముఖి అనే గొప్ప పండితులు "చతుర్దండి ప్రకాశిక" అనే శ్రేష్టమైన గ్రంథాన్ని వ్రాశారు. వీరు దక్షిణదేశస్థులే. మేళకర్తలు, వేరు వేరు నామములతో 72గా వీరే ప్రప్రథమమున ఏర్పరిచి వ్రాశారు.

హిందుస్థానీ వాళ్లు "మేలకర్త"లను "థాట్"లు అంటారు. "థాట్" అంటే ఏస్వరసమూహములో రాగము ఉత్పత్తి అగునో దానిని "మేళము" గాని "థాట్" గాని అందుము. పండిట్ వెంకటముఖి గారు అటువంటి స్వర సమూహములు 72 కని పెట్టినారు. థాట్ ని గురించిన వివరాలు మరియొక సారి వ్రాస్తాను. ప్రస్తుతం ఇంకా వెనుక జరిగిన విషయాలు తెలుసుకుందాము.

ఇంతకు కొంచెము ముందు గ్వాలియరు సంస్థానంలో రాజామాన్ సింగు కాలంలోనే నాయకబక్షూ అనే గొప్ప విద్వాన్ ఉండేవాడట. ఆ రోజుల్లోనే "ధృపద్" పాటలు ప్రచారంలోకి వచ్చాయట.

అక్బర్ పాదుషా కాలానికి (A. D. 1556 to 1605) సంగీత చరిత్రలో చాలా మార్పులు ఏర్పడ్డాయి.

అక్బరు సంగీతప్రియుడు. గాయకులను, కవులను, పండితులను ఎంతో ప్రోత్సాహపరచి, కుమిలి పోతున్న కళలను వృద్ధిలోకి తీసుకువచ్చాడు. కాని అక్బరు పాదుషా దర్బారులో కూడా. ఎంత ధార్మికుడని చెప్పబడ్డా, తన 36 ఆస్థానపండితుల్లోనూ, చెప్పుకోతగిన హిందూ విద్వాన్లు ముగ్గురు, నలుగురు మాత్రమే! మిగతావారందరూ ముసల్మానులే! ఆ సమయంలో హిందుస్థానీ సంగీతంలో మరికొన్ని మార్పులు ఏర్పడ్డాయి అనుటకు సందేహంలేదు. కాని ఆ మార్పులు మనకు లాభదాయకంగానే ఉన్నాయి. స్వరాలలో మంచి మృదుత్వం, హాయి, వీనులకు విందుగా ఉండేందుకు ముఖ్యకారణాలు ఈమార్పులే అన వచ్చును. అక్బరు పాలనలోనే, ప్రఖ్యాతి పురుషులైన శాంత్ హరిదాసకవులు యమునానదీ తీరమున బృందావనంలో నివసించేవారు. వారి శిష్య బృందములోని వారే, తాన్ సేన్.

తాన్ సేన్ ని గురించి విననివారుండరు. ఆ కాలంలోనే హిందుస్థానీ సంగీతము గొప్ప ఉన్నతికి వచ్చింది.

అక్బరు కాలంలోనేగదా ఉదయపూర్ రాణా యొక్క ధర్మపత్ని అయిన మీరాబాయి గొప్ప ప్రఖ్యాతి గాంచెను. అక్బరు స్వయముగా ఆమె

భక్తిరసమైన కీర్తనలను వినటానికి వెళ్ళియున్నాడని కూడా చెప్తారు. ఇంకను అనేకమంది గొప్ప గొప్ప కవులు అక్బరు కాలంలోనే అనేక గ్రంథాలుకూడా వ్రాసినట్లు తెలుస్తోంది. అందులో పుండరీక విఠల్ అనే ఆయన వ్రాసిన సంగీత శాస్త్రానికి చెందిన గ్రంథాలుకొన్ని ప్రశంసనీయములని, పండిట్ భట్ కండేగారు వ్రాసినారు.

తులసీదాసులుకూడా అక్బరు కాలంలోనివారే. పుండరీక విఠలే, మొట్టమొదట రాగములను, రాగములనీ రాగిణీలనీ, పుత్రరాగములనీ, పుత్ర బంధురాగములనీ 4 భాగాలుగా విభజించినట్లు తెలుస్తోంది. రాగములు, రాగిణీలనుగురించి చాలా విమర్శనతో శ్రీ॥ O. C. గంగులీగారు వ్రాసిన శ్రద్ధాజనకమైన గ్రంథాన్ని కళాభిమానులందరూ ముఖ్యంగా చదువవలసిందే. శ్రీ॥ గంగులీగారు ఇప్పటికీ అలహాబాదులో నున్నారని తెల్పుటకు సంతసించుచున్నాను.

అక్బరు తర్వాత అతని కుమారుడు జహంగీరు గద్దె కెక్కినాడు. కవితులసీదాస్ జహంగీరు కాలంలోనే పరమపదించినట్లు తెలుస్తోంది.

అక్బరువలె జహంగీరు తనదర్బారులో అనేకమంది కవులనూ, విద్వాంసులనూ పెట్టుకోలేదు. దామోదర పండితులు జహంగీరు కాలంలోని వాడేననీ "సంగీతదర్పణము" అనేగ్రంథాన్ని వ్రాశారనీ తెలుస్తోంది. చాలా కాలంతర్వాత ఈ "సంగీతదర్పణ" మనేగ్రంథాన్నే పర్షియన్ భాషలోకి translate చేయబడ్డదనీకూడా తెలుస్తోంది.

జహంగీరు తర్వాత షాజాహాన్ సింహాసనానికి వచ్చాడు. షాజాహాన్ పరిపాలన కాలంలోనే అహోబలశాస్త్రి అనే గొప్పకవి "సంగీత పారిజాత" మనేగ్రంథాన్ని షుమారు 1630 A. D. లో వ్రాసినట్లు తెలుస్తోంది. షాజాహాన్ రాజ్యంలో ఉన్న ముఖ్యవిద్వాన్లు - జగన్నాధ పండిట్, లాల్ ఖాన్, అంటారు. వీరిరువురూ కూడా గొప్పగాయకులనీ, బాదుషా వీరికి "కవిరాజు" "గానసముద్ర" అని కూడా బిరుదులు ఇచ్చినట్లు తెలుస్తోంది.

షాజాహాన్ వెనుక అతని కుమారుడు ఔరంగజేబ్ రాజ్యాన్ని అలంకరించాడు. ఔరంగజేబ్ కి సంగీతమన్న తెగ అసహ్యము, చీదర. పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేటట్లుండేది అతనికి. సంగీతాన్ని ఏమూలా కూడా మిగులకుండునట్లు ఆజ్ఞఇచ్చాడు. సంగీతమనే చిహ్నలేకుండేటట్లు చేశాడు. అంతటితో తృప్తి చెందక, పాపం ఆ మహానుభావుడు, ఎక్కడెక్కడనో ఉన్న పురాతన వాద్యముల నన్నింటినీ తగులబెట్టించినాడు! సంగీతము పాడువారిని భయపరచి, పూర్తిగా మానేసిన వారికి కానుకలు, పారితోషికములు ఇచ్చి సంతోషపరిచేవాడు. ఆహా ఎంత ఘనుడు!! మనము ఔరంగజేబు కాలంలో పుట్టలేదుగదా అని సంతోషిస్తున్నాను. లేకపోతే నన్ను ఈ వ్యాసమైనా వ్రాయనిచ్చేవాడు కాదేమో!! ఇంక ఔరంగజేబు పాలన, అప్పటి కళలను గురించి విస్తరించి చెప్పనవసరము లేదు.

తిర్గి మహమ్మదుషా కాలంలో సంగీతమనేది కొంచెం అభివృద్ధిలోకి వచ్చింది. ఇంకనూ అనేకమంది కవులు, అనేక గ్రంథాలు వ్రాసి, దక్షిణాది సంగీతానికీ ఉత్తర హిందుస్థానీ సంగీతానికీ కొద్ది మార్పులు అనగా పేర్లలో మాత్రం ఏర్పరచినారు. మహమ్మదుషా కాలంలోనే, అదార్ంగ, సాదారంగ అనే ఇద్దరు గొప్పకవులు ప్రసిద్ధిచెందిరి. వీరే "టప్పా" జాతిపాటలు మొట్టమొదట పాడేవారట. పర్షియన్ సంగీతంకూడా అప్పటికి బాగా కలిసిపోయింది.

తరానాలు, ఘజల్, టప్పాలు అప్పుడే ప్రచారంలోకి వచ్చాయి.

మళ్లీమన "బ్రిటిష్ పీరియడ్" లో, మన కళలు చాలా మట్టుకు అడుగు పడిపోయినాయి. కొన్ని సంస్థానాల్లో మాత్రమే నిలచాయి. విదేశస్థులు చిరకాలాన్నించి ఉన్న మన ఈ కళలను మొరటుగా (barborous) భావించేవారు. అందువల్ల, Quantity లోనూ, qualityలోనూ సంగీతము చాలా హీనస్థితికి వచ్చింది. మళ్లీ 1900 శతాబ్దములో అనగా

ఈ మనతరంలోనే, పెద్దలు, గొప్ప విద్వాంసులూ అయిన శ్రీ పండిట్ V. N. భట్ కండేగారునూ వారి అనుచరులూనూ, ఉత్తర హిందుస్థానములో పూర్తిగా క్షీణించి పోతున్న ఈ art ను పునాది నుంచి పడిపోకుండేటట్లు, ఎన్నో ప్రయత్నాలు చేసి, ఎన్నో లెక్చర్లు ఇచ్చి, గ్రంథాలు వ్రాసి, ప్రజలకు నచ్చచెప్పి, స్వయముగా, వారికుస్థానమైన బొంబాయి నగరంలో అనేకమందిని తమశిష్యులుగా చేసుకొని, వారు పూర్తిగా ఈ విద్యల నభ్యసించునట్లు కృషిచేసి, ఉత్తర హిందుస్థానములో గ్వాలియరు, బరోడా, లక్నో, మొదలైన ఊళ్లలో సంగీత విద్యాలయాలు తెరిపించి, తమ శిష్యులనే ఆ యా కాలేజీలకు పెద్దలను చేసి, ఈ విద్యావ్యాప్తి కొరకు ఇంకనూ ఎన్నోపాట్లు పడ్డారు. ఈ మహానుభావులు ప్రారంభించినదే నేడు ఎంతో ఉన్నతికి వచ్చిన మాలక్నో సంగీత విద్యాలయము. 1926 సం॥ లో, ముగ్గురు, నలుగురు బాలికాబాలురతో ప్రారంభింపబడ్డ ఈ విద్యాలయం నేడు all India సంస్థగా-ఎంతో ఉన్నతస్థితికి వచ్చిందని తెల్పుటకు గర్విస్తున్నాము. ఆ రోజుల్లో Sir Morris అనే దొరగారు U. P. కి గవర్నరుగా ఉండి, హిందుస్థానీ సంగీతమునందు అభిలాషగలవారై ఈ విద్యాలయం స్థాపించుటకు ప్రోత్సాహముచేసి, సర్కారువారి చేత ప్రతి సంవత్సరము grant కూడా ఇప్పించారు. అప్పటినుండీ ఈ కాలేజీ, Morris College of music గానే ప్రసిద్ధిచెందింది. ప్రతి సంవత్సరం-రెండు, మూడు వందల విద్యార్థులను తయారు చేస్తోంది ఈ సంస్థ. ఈ కాలేజికి మొదటినుండీ, నేటివరకూ Principal గా వున్న - శ్రీ॥ S. N. రత్తంజంకరుగారు, పండిట్ భట్‌కండేగారి శిష్యులే. వీరిని, వీరివిద్యనీ పూరా హిందుస్థాన్ అంతటనూ విననివారులేరు. పండిట్ భట్‌కండేగారు 1936లో స్వర్గీయులైనప్పటినుండి ఈ శ్రీ॥ రత్తంజంకరుగారే, వారి స్థానమును తీసుకొని, సంగీతము, దానికి చెందిన ఇతరకళలు, వృద్ధిలోకి తీసుకురావడానికి ఎంతయో శ్రమపడి ఈ కృషిలో ఉత్తీర్ణులైరని తెల్పుటకెంతయూ సంతసించుచున్నాను. వీరు ఇప్పుడు కొంత మన కర్ణాటక సంగీతాన్నికూడా ఈ ప్రక్కల వ్యాప్తి చేయదలచినారు. కర్ణాటకసంగీతములోనున్న రుచి, దాని technique వీరికీ బాగా తెలుసు. కొన్ని దక్షిణ దేశపు గ్రంథాలు చదువవలెననే వాంఛతో, వీరు తమస్వయం కృషివల్లనే, తెలుగు, తమిళము నేర్చుకొని, మన పూర్వులు, ఇప్పటివారు కూడా వ్రాసినగ్రంథాలన్నీ చదివారు. మన వర్ణాలు, త్యాగరాజ కృతులు, కంఠతావల్లించారు. కర్ణాటక పద్ధతిప్రకారం, కొన్నివర్ణాలు, కృతులూకూడా, సంస్కృతంలోనూ, హిందీలోనూ, మారాఠీలోనూ కూడా వ్రాసియున్నారు. వీరు రచించినవి అనేక గ్రంథములుగలవు. అందులో ముఖ్యంగా వీరు వ్రాసిన-సంగీతశిక్ష, అభినవగీతమంజరి - హిందుస్థానీ సంగీత పద్ధతి, అనే పుస్తకాలు, సంగీతమునందు రుచిగల ప్రతివ్యక్తి చదువవలసినదే.

భగవంతుడు వీరికి ఆయురారోగ్యములనిచ్చి మన దేశములో సంగీతాభివృద్ధికి ఇంకనూ ఎన్నో క్రొత్తక్రొత్త విషయములను తెల్పునట్లు చేయగలందులకు భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఈ నా చిన్న వ్యాసములో ఏమన్న తెలియక వ్రాసినతప్పులు చదువరులు గమనించిన మన్నించ ప్రార్థన. సంగీత శాస్త్రమందు నాకు గొప్పజ్ఞానమున్నదని వ్రాయలేదు. ఈ శాస్త్రాన్ని గురించిన కొద్ది గ్రంథాలు చదివిన దానినై, నాకు తెలిసినమట్టుకు హిందుస్థానీ సంగీతాన్నిగురించి తెలియని కొందరు సోదరీమణులకు తెలియజేద్దాంగదా అనే ఉద్దేశ్యమేగాని - వేరుగాదు. సెలవు.



# ఫ్లారెన్సు నైటింగేల్

శ్రీ ఎస్. ఎల్. నారాయణమూర్తి

ఎవరమ్మా యిటులీనిశీథమున నీవేకాకివై చేతిలో
దివియం బూని, రణాక్షతాంగుల వ్యథా దీనంబులౌ మూలుగుల్
చెవులంజీల్చుచు మృత్యుగహ్వరము వోలెన్ దోచునిచ్చోట నె
ట్టి విపద్భీతియు లేక తెల్సినది నైటింగేలు ధాత్రీమణీ!

కరచరణంబులంగలుగు గాయపు బాధకు తాళలేక ని
ద్దుర యొక యింత రాక వెతతో బడియున్న రుజార్తులెల్లనీ
వరసిపి ప్రక్కనేగు సమయంబున నీదగు నీడగాంచి యా
దరమున ముద్దు గొందురు కృతజ్ఞత చూపుచు; నెంత ధన్యవో!

కత్తులతో చికిత్సలును, కట్లును, మందులు, సూదిపోటులున్
మత్తుపదార్థముల్ లవము మానుపజాలని రోగబాధ నీ
మెత్తనిస్పర్శకున్ కరుణమీరెడు చూడ్కికి మేల్ సపర్యకున్
సత్తెముగా దొలంగె; నిను నన్నుతిసేయదరంబె సోదరీ!

సేవాదీక్షయు త్యాగశీలమును దాక్షిణ్యంబు నానాసప
ర్యావైదుష్యము సౌకుమార్యము దయార్ద్రస్వాంతమున్ రక్షణా
ప్రావీణ్యంబును స్త్రీలసొమ్ములనుచున్ ప్రత్యక్షమౌరీతిగా
యావద్భూస్థలి చాటిచూపిన నినున్ హర్షింతురాకల్పమున్.

నీసుధా మధురాతి నిర్మలవదన కాంతులకు మృత్యుచ్ఛాయ తొలగె నొకట
నీ మందహాస సుస్నిగ్ధ వీక్షణములకు దుర్భర నిస్పృహల్ తొలగె నొకట
నీ దయాకలిత వచోదార మంత్ర శక్తులకేగు ప్రాణముల్ నిలిచె నొకట
నీ దివ్యహస్తాబ్జ సాదరస్పర్శకు పటురోగ తీవ్రార్తి వాసె నొకట.

ప్రేమ త్యాగమ్ము కరుణ మూర్తీభవించి-పుట్టియుంటివి కాబోలు భూతలమున
నిన్ను చూచినమాత్రాన నిఖిలరోగ-బాధ లొక త్రుటిలో పటాపంచలయ్యె.

# ఆంధ్ర కవయిత్రులు

## యుగలక్షణ సమన్వయము

ఆదినుండియు వాఙ్మయ క్షేత్రమున అనౌచిత్యము పొందబోక కవయిత్రులు తమ ప్రత్యేకస్థాన గౌరవమును దాము బాగుగ నిలుపుకొనుచునే వచ్చిరి. పురుషులే సృష్టియంతకును ప్రాతినిధ్యము దీసుకొని అంగన హృదయ స్వభావములను వెలిబుచ్చిన నెట్లుండునో మనకందఱకును అనుభూత పూర్వమే. స్త్రీహృదయ మెంతకోమలమో, యంత గహనము ఎంత గంభీరమో, యంత సౌశీలము. అట్టి స్త్రీ హృదయమును చిత్రించుట, స్త్రీల తలంపులను స్త్రీల పరముగా చిత్రించి శిల్పమున మలచుట యనునది బ్రహ్మకును నలవికానిపని. సిద్ధహస్తులగు కళాదులు ఇట్టి నగిషీపనిని జిలుగు పోగరతో చెక్కి వీ సాధించిన వారకొందఱు లేకపోలేదు. "చిన్ని మనసునను చిన్నబుచ్చెటి యెన్నికవి రోచింతురో, మాల మాగి కన్నె నెవతెను మరులు కొనరాదో" యని శ్రీగురజాడవారు ఒకచో కుపితయగు సతిచే పతిపైగల అక్కసును వెళ్ళగక్కించిరి. కోపనలగు తరుణులు సాజముగ నిట్లే పలికి ఉలుకు వెళ్ళగక్కుచుందురు. కాని స్త్రీయే తనకు తానై తనస్వభావమును చిత్రించుచో నింకను స్వభావ రమణీయముగను, సత్యసంబద్ధముగను నుండునేమో? అట్టిపోలకువ లేమైన యీమణి రమణీయ వాఙ్మయమున మాకంట బడునా? పరిశీలింతము.

మహిళా వాఙ్మయ సృష్టికి నాందీ పూజనమైన "పగరకు వెన్నిచ్చినచో నగరేనిను మగతనంపు నాయకురెండున్," అనుమానితార మేవిధమునను కాలుష్యము నందని, సాంకర్యము నందని, న్యూనత నంగీకరింపని మానినీహృదయవ్యక్తియగుటొక భాగ్యమనవలయును.

ఆదికవయిత్రులలో నెన్నికగన్న కావ్యము సృజియించిన గంగాదేవి, రామభద్రాంబ, రంగాజి మొదలగువారు కవితా ప్రియులును, మహారాజులునైన తమ తమ ప్రభుల మనసులకు నచ్చిన విద్యా గోష్ఠులకే తాము మనసిచ్చి తత్ప్రియ వీరవిజయ గాథలకే కావ్య గౌరవము కల్పించి కృతజ్ఞత మెఱయించుట యీఘట్టమున గమనార్హము కాదగిన విషయము. అందును గంగాదేవి వర్ణించిన చంద్రవర్ణన మందలి స్త్రీ సహజ స్వభావ ప్రవృత్తిని పాఠకులు గమనించియే యుందురు. అప్పటికి నిప్పటికిని మహిళా వాఙ్మయ పోషకులుగ పేర్కొనదగిన వారెవ్వరునులేరు. ఒక్క రఘునాథ భూపుడును, నాతని నందనుడు విజయరామ నాయకుడును, పదపడి శ్రీవీరేశలింగము పంతులుగారును. ఇప్పటి గృహలక్ష్మి సంపాదకులు శ్రీకేసరిగారును దక్క. ఆమహారాజుల కాలమున ననిందపూర్వముగ నుభయభాషల యందును రమణీ రమణీయ కృతులు బహుళముగా వెలసి బహుధా ప్రతిపత్తినందినవి.

కాని మఱియొక ముఖ్యాంశము:- ఆకాలము నాటి వాఙ్మయరీతి, లక్షణము - నాయక రాజుల యేల్బడిని తీర్చబడిన సాహిత్య వీధులలో ధర్మాపేతమో ధర్మోపేతమో ఏదియైనకానిండు, పచ్చి శృంగారము అతిపలుచనమునకు లోనై విశృంఖల విహారము సేయుచు దొరలిపోయినది. మగనాలైన గంగాదేవియేకాదు; విలాసహేలలకు విహారభూములన దగు నావెలయాండ్రైనను తమ కావ్యము లందు అట్టి ధర్మగ్లానికి పాల్పడిరా? వారందఱును సరసార్థ మంజులములను, గంభీరార్థ మహనీయములును నగు కావ్యశ్రేణి నుత్పాదించిన గౌరవము నొందదగినవారేయైనారు. ఔచిత్య విచారమున స్త్రీల లజ్జాశీలమునకు, హృదయ పవిత్రతకు నాకావ్యములు పరమసాక్షులేకదా. ఇందుండి తప్పినది ఒకముద్దుపళని; అయిన కొంతజోహారు. అయిన విశృంఖల పరచిన విపుల శృంగారమునకును ఆధ్యాత్మికముగ నర్థము చెప్పుచో నదిసమ్మాన్యమే యని కొందఱందురు. ఆమె యుద్దేశమేమో ఎవరికిని దెలియరాదు. కాని

స్థూలదృష్టికి గనపడునా నాయిక రచనచే నదికలుషితమే యైనది. లజ్జావతి యని పేరొందిన స్త్రీయింత వావిడచి శృంగారమును వర్ణింపగలదా? యని అబ్బురముగ ముక్కుపై వ్రేలుంచుకొనుటకే యీగ్రంథము నిదర్శనమైనది.

కాని ముఖ్యముగ తన కావ్యమున పళని స్త్రీ హృదయమును చిత్రించుటలో ప్రత్యేకముగ పని చూపిన దనవలెను. 'మగనికి పెండ్లియగునని సంబరమే కాని, తనకు సవతి వచ్చునని, అప్పటి యనుభవము దుస్సహము' నియెఱుగని రాధ గోలతనమును బేలతనమును అందు ఎంతచక్కగా నిరూపితములైనవో వ్రాయుట కలవి కానిపని. 'సొమ్మియ్యవచ్చు సొమ్ముందమియ్యవచ్చు ఇయ్యరాని ప్రాణమియ్యవచ్చు. మగని నొరుల చేతికిచ్చు మనగతరమె?' అను పద్యమున స్త్రీభావము అచ్చుపడినది. పళనికావ్యమున ప్రతిబింబించినంతగా మానినీహృదయము, స్త్రీస్వభావమును మఱింకెందును గానము.

మృదుమధుర కంకణక్వాణములొప్ప ఊయల నూపితే బ్రాయుల జోకొట్టి నిద్రింపజేయు కోమలకరమును, ప్రాణపతికి మధురభక్ష్యములతో బాటు మధుమధురమగు హృదయమును ఆమెతగా నిడు అమృతహస్తములు సంతతమనోహరములగు కావ్యసూనముల విరియించి యెంత మకరందమును చిందింపగలవో, యశ నంశమును జాతీయతాసంయుతములగు తమ రచనలద్వారా, స్త్రీల నిత్యసంభాషణలలో అలవోకగా దొరలిపోవు కుప్పలు తెప్పలగు సామెతలతో కూడిన తమ ప్రబంధముల ద్వారా మొల్లయు ముద్దుపళనియు ఋజువు పఱచినారు. అందును మొల్ల పండిత ప్రభువులనదగిన వారికిని తన కావ్యాపణమున బలపుతలపుల సొమ్మును బదులిడిన బ్యాంకరు!

ముద్దుపళని, మొల్లలను దడవుటతో చాలముందునకువచ్చిపడితిమి. కాని 'చేమకూరను పాకముగా పక్వముచేసి సెబాసనిపించుకొన్న వెంకటకవి కావ్యసంసారమునకును భావసామగ్రిని పసదనములిచ్చిన ఉదారకుటుంబిని తిమ్మక్క వస్తుసంపద, ఔదార్యము విడరానిది. తిమ్మక్క ఈద్విపద కావ్యమే కాక కీర్తనలుకూడ రచించినది. తిమ్మక్క కీర్తనలయందును, రంగాజమ్మ యక్షగానమునందును పదకవితారచన రాగతాళ నాట్యభంగిమములతో సజీవముగా రూపుతల్చినది. ఇందువారు ఒదుగుతో కూడికొన్న, కంఠగత కోమలత్వమును శబ్దమున సన్నిధ పిడిచినారు. రూపచిత్రణతో కూడి సాకారతను భజించిన నాట్యాభినయములు రంగాజి ప్రబంధమునందలి గేయములనుండి కదలిపోవుచుండును.

ఇతరమున ద్విపద రచనలు చేసినవారు తఱికుండ వెంకమాంబతో నిర్వురు. యక్షగానములు చేసినవారును ఆమెతో నిర్వురే. వెంకమాంబ, ద్విపద, కీర్తన, యక్షగానము, కావ్యమను అను వివిధ శాఖలలో తరిశ్రమించిన మనీషియనిపించుకొన్నది. ఆధ్యాత్మికత యామెతోడనే యీ యుగమున కావ్యములలో ప్రత్యక్షమైనది.

ఈయుగలక్షణము నింకను క్రోడీకరింపవలెననిన నిట్లుగా నుగ్గడింపదగును.

అది కవయిత్రులైన వీరందఱును తెనుగున మార్గదేశిచ్ఛందస్సులలో వివిధ మార్గముల తమ కవితారథమును నడిపించినారు. పురాణములు కావ్యములే కాదు, ప్రబంధములు యక్షగానములునను శాఖలను వెలయించినారు. జాతీయములు సామెతలును ఒదుగుట తమగుతామే సాటియైనారు. తమకల్పనలన్య జవిరాజన్యుల కనల్ప కథా శిల్పమాతృకలవున్నట్లు దిద్దితీర్చినారు. ఇది యీ యుగమునకే కల ప్రత్యేక లక్షణము. తేనెసోక నోరు తియ్యనయగు రీతితోడ నర్ధమెల్ల దోచునట్లు పలుకని కావ్యము మూగచెవిటి వారి ముచ్చటయని మదలకించి కందువమాటల కామెత లందముగా గూర్చి చెప్పినపుడే తెనుగున కవిపొంది పొంకమై వీనుల విందగునని చెప్పినమాట చెల్లికచి చూపినారు. ప్రియవల్లభుల సాహస గాధలకు కవితా చాతుర్యమును దోడు చేసి యాశాశ్వతత్వము కల్పించి మాన్యలైనారు. పండిత వాదముల పట్టుచూపి జయముచేపట్టి సరస్వతీపీఠమును తంజనగరమునకు తరలించినారు. నాడు

విద్యానగరము కవులకు కొలువైనట్లు నేడు తంజాపురి కవయిత్రులకు పట్టుగొమ్మయైనది. ముఖ్యముగా సంస్కృతపు చవియెక్కువైనది. విపుల కావ్యకవిత యీ యుగధర్మమనిపించినది.

మఱల తెరయెత్తుసరికి రంగము నలంకరించినది వీరేశలింగమహాకవి యీ స్థానము. ఇందు ముందు రానున్న అన్ని విధములగు కవిత్వశాఖలకును నాంది జరిగినది. ఇది సంధియుగమని మున్నే పేర్కొనియుంటిమి. స్త్రీవిద్యా ప్రణాళికలు, ప్రబోధములు - ప్రవర్ధిల్లి నవీ సమయముననే అథ పతనమైయున్న స్త్రీ సంఘ వ్యవస్థను చక్కబఱచి సంస్కరించుటకై స్త్రీలచే నడుపబడిన అనసూయా, హిందూ సుందరి సావిత్రి పత్రికలు బయలువెడలినవీ యుగముననేకదా. సీరము సుబ్రదమ్మగారియందు వివిధ కావ్యకవితయు, పులుగుర్త లక్ష్మీనరసమాంబగారియందు పురాణకవితయు పొలుపుచెందినవి. శతకము లారంభమైనదీ కాలముననే. అప్పటిశతక మిప్పటికిని ప్రణుతిశతమందుచునే యున్నది. కవిత్వాభ్యాసమునకై యందఱు నేదో శతకము చేసిరాయనిపించును. వయసున చిన్నదైనను కాళ్లకూరి మహాలక్ష్మీ సుందరి నీయుగముననే చేర్చవలసి వచ్చినది. ఆంగ్లమున కైత నల్లినయామె యీయుగమున నీమె యొకతె యగపడుచున్నారు. వెన్నెలకంటి హనుమాయమ్మగారి సంస్కృతకావ్య నేతృతా విశిష్టత విస్మరింపదగినదికాదు. జ్ఞానమాంబగారి రచనమొక 'తృతీయ, పంథా' అరుచిరకావ్య రత్నములతో సరిదీటుగా ప్రకాశింపగల కావ్యములరుదు. ఆమహాయోగిని కొక్క నమస్కారముచేసి సాగిపోవలసినదే. ఈమె మొదలుగా మహిళా సారస్వతమునగూడ బ్రహ్మసమాజమతవాసనలలుముకొన్నవి.

తరువాత తరువాత సారస్వతమునందలి అన్ని శాఖలును ప్రబ్బికొన్నవి. కావ్యములు, ప్రబంధములు ద్విపదలు శతకములు, నవలలు, నాటకములు, ఏకాంకములు, కథానికములు, గల్పికలు, ఖండకావ్యములుకి మున్నగునవెన్నో పోనుపోను ప్రోద్బలము పొందినవి. శ్రీ కనకమ్మగారు, గుడిపూడి ఇందుమతీదేవి, చేబ్రోలు సరస్వతీదేవి, సీతాంబగార్ల రచనలలో ఆధ్యాత్మిక కావ్యములు పురాణములు ప్రబంధములు, నాటకములు, ఖండకృతులు, నవలలు మఱికొన్నవి. పొణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారి భగవద్గీతానువాదము తెలుగున కొకయలంకారము. సరస్వతీ రామాయణముతో స్త్రీల రామాయణములు ముచ్చటగ మూడని యీ వఱకే ముచ్చటించియుంటిమి.

దేశరాజు భారతీదేవి, గంటి కృష్ణవేణమ్మ, ఓలేటి నిత్యకళ్యాణమ్మ మున్నగు వారి రచనలలోను, ఇంకను ఇతరుల కొందఱి రచనలలోను, వీరనాయక స్మృతులు, పండుగలు, రాష్ట్రోద్యమములు, స్వాతంత్ర్య దేశ సముద్దీప్తులు కనము కాంచగలము.

పుట్టపర్తి కనకమ్మగారు, రాజేశ్వరి, దేవులపల్లి సత్యవతమ్మ, చర్ల నగరాజకుమారి, ఇంకను కొందఱు వ్రాసిన 'జాతిరథము, సత్యాగ్రహోద్యమము, బొబ్బిలి బెబ్బులి, లవణ సాగర మథనము, వీర చంద్రావతి శీర్షికలలో దేశభక్తి తీపరించియున్నది. మదమంచి అనంతమ్మగారి రాష్ట్రోద్బోధము తీరే వేరు. అది ఉత్తమమగు ధ్వని మూలము. గండరించిన వారి శిల్పము నందలి కావ్య మూర్తులు సజీవములై వ్యక్తులతో ఎట్ట ఎదుట నిలువబడి పలుకరించి ప్రబోధము చేయుచున్నట్లుండును. అది యెవ్వరును ప్రయత్నించియు ప్రాపింతేనిదేమో? వారిజాతీయోద్బోధము స్తుతి పాత్రము. ముఖ్యముగా మదమంచి వారిది చాలా మంచి కవిత్వము; బుర్రా కమలాదేవి గారి ఖండకావ్యముల ప్రశస్తియొక ప్రత్యేక స్థానము నాక్రమించినది. ఆంగ్లభాషా కవితా ప్రభావమున ఆంధ్ర సారస్వతమున ప్రభవించిన Lyric సాంప్రదాయము వీరిలో చక్కగా ప్రతిఫలించినది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిలో ఏచి పూచిన విషాద కావ్యగానము వీరిలో పక్వముచెందినది. చరమ పరాకాష్ఠనందిన వీరి విషాద వీణాశ్రుతీ నిక్వాణములో ప్రతివారి అనుభవములు ఏదో విధముగా ప్రతిని నదించుచునె యుండును. ఇంతకును సారస్వత



(50-వ పేజీ చూడుడు)

(48 పేజి తరువాయి)

మున వారి కృతుల చక్కని పీఠమున్నదనుట నిర్వివాదాంశమనియే సారాంశము.

సోదరి స్థానాపతి రుక్మిణమ్మగారి రచనలలో చంద్రుని నుండి తొరగి పారిన యమృతమువలె కళా మాధుర్యము తొణికిసలాడుచుండును. శ్రీమతులు విశ్వసుందరమ్మ రాజ్యలక్ష్మమ్మగారల భావకవిత్వపు పలుకుబడులు చవిచూచియే యుంటిరి. ఈభావ కవితా ప్రాబల్యముయువకులలో ఎక్కువ ప్రోత్సాహమును రేపినది. భావకవిత్వమున పరిణత ప్రజ్ఞులగు వారి నాదర్శముగ పెట్టికొని యాకవిత్వమునకు మన నిచ్చిన వారెందరో కలరు. భారతదేశ స్వతంత్రతా సముపార్జనమున చూపిన వివిధభావ సంచాలన కావ్య జగత్తును కదిలించి వైచి కమ్మని రచనల కాధార ప్రాయములైనవి. దేశరాజు భారతీదేవి మున్నగు కొందఱ రచనలలోనివి కొల్లలుగ కనిపించుచున్నవి.

అష్టాదశ వర్ణనలతోడి మహా కావ్యములకంటె అల్పార్థ సంప్రయోజనములగు ఖండ కావ్యములు హెచ్చు ప్రచారము నొందినవి. అంతకంటెను రస ప్లుతములగు ఖండికలు బహుళ ప్రశస్తి నొందినవి. వీనివలన కావ్య ధర్మము కుంటు వడినదనువారు కొందఱు, వీనివలననే కావ్య ప్రయోజన మెక్కుడుగ సిద్ధించినదనువారు కొందఱునై వాదోపవాదముల బెంచిరి. కాని సిద్ధాంతమును భావికాలముననే యప్పగించిరి. కావ్యమేదియైనను తద్గత భావార్థము లేకద ముఖ్యార్థములు. అట్టియెడ నిది మహాకావ్యమా, ఖండ కావ్యమా, భావకవిత్వమా, ప్రబంధకవిత్వమా యను చర్చ పండితమ్మన్యులగు వైతండికుల పనియే కాని వేరొండు కాదు. ఒకానొక నిర్దిష్టమగు ఛందమున నిర్దిష్టమగు పద్ధతిని జగచ్ఛ్రేయోపాదకములగు కావ్యార్థముల వివరించి ప్రచలింప జేయుటయు పరాయణమే.

ఇంతలో నాటకము నందంతర్నాటకము వలె శ్రీ శ్రీ, చలంగార్ల ప్రవేశముతో రంగము క్రొత్త రంగులు దొడగినది. వీరు వెలయించిన క్రొత్తబాటయే గేయ సారస్వతము. దీనిలక్షణమును గూర్చి వెనుకనే బాగుగ తఱచియుంటిమి. నిజముగ నిదియొక యపురూపపు కవిత్వమే. క్రొత్తపల్లి లలిత మున్నగువారీ కవితా సఖితో చనవిచ్చి స్నేహసంబంధములు తళుకొత్త జేసిరి. లలితమ్మ లలిత లలితముగ ఆంగ్లమున గూడకవి చెప్పగలదట. ఆమెతోబాటు ఆంగ్లమున, కవిత్వము చెప్పువారు మూవురు. తక్కినవారు మహాలక్ష్మీసుందరి, బుర్రా కమలాదేవియు నని పాఠకులు మఱచి యుండరు.

పట్టికొండ విశాలాక్షి, కొమ్మూరి పద్మావతిగారి రచనలలోని అహంభావ కవిత్వపు ధనుష్టంకారములు వీనులసోకినవి.

ఇన్నితరములు గడచిన పిదప స్త్రీ వాఙ్మయమును గూర్చిన భావనలేవియు నిదమిత్థమ్మని యేర్పడునో లేదో. అన్నిశాఖలలో, అన్ని రంగములలో, అన్ని కాలములలో స్త్రీలు తమ యోపినకొలంది సాహితీ సమర్చణ సేయుచు దేశసేవా ధర్మమున తమ కనీసమగు బాధ్యతనైనం దీర్చిరనియే చెప్పవలసి యున్నది.

మహిళా సారస్వతమనల్పమై, మహీయస గౌరవమున కాస్పదమై శాశ్వతమై భాసించునుగాత!

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ



# సు భా షి తా లు



"స్త్రీ పురుషులు ఒకరిమీద ఒకరికిఉండే హక్కు సమానం, కాన ప్రేమ విషయంలోకూడా ఉభయులూ సమానులే!"

"విశ్వకవి టాగూర్"

"స్త్రీల కష్టాలను అర్థంచేసుకొనేటందుకు సానుభూతిగల హృదయాలు మాత్రమే కావాలి, స్త్రీలు యీప్రపంచంనుండి మాయమైననాడుగాని, వాళ్ళఔన్నత్యం మనకు గోచరించదు."

"శరత్ బాబు"

"స్త్రీని కామదృష్టితో వీక్షించటంలోనే నీచత్వమంతాఉంది. ఈదృష్టిని తొలిగించిచూస్తే, స్త్రీ ఆదిశక్తి స్వరూపిణి."

"రామకృష్ణ పరమహంస"

"స్త్రీలవలెనే ప్రజలుకూడా సదా తమను భరించేవారు ఎవరో ఒకరుండాలని కోరుతారు. వారికి మల్లే వీరుకూడా తాము వినగోరే విషయాలను తప్ప, మరే అంశమూ ఎవరూ తమకు చెప్పటానికి ఇష్టపడరు."

"శశే"

"స్త్రీలు తమ భర్తలకు విడాకులివ్వటానికి కారణం, వారికి తమ మగవారిని స్వాధీనం చేసుకొనటానికి తగినంత మానసిక శక్తి లేకపోవుటవలన."

"మార్క్వెస్"

"శీలం...ఒక శ్వేతపత్రం....దానిమీద సిరామచ్చ మాయనిమచ్చ."

"కార్లైల్"

"సాంఘిక స్వాతంత్ర్యానికి శీలమే ప్రధానమైనది."

"బాపూ"

"తనను ప్రేమించని వాళ్ళకు బలవంతంగా తన ప్రేమను వెల్లడించబోవడంకంటే తెలివితక్కువపని ఈ ప్రపంచంలో మరొకటిలేదు."

"శరత్ బాబు"

సేకరణ : గం. లక్ష్మీప్రసాద్

——(౦)——

# ప్రేమకానుక

శ్రీ పుల్లగంపల్లి గోవిందరెడ్డి

ఇరవై సంవత్సరములు గడచిపోయినవి. దట్టమైన ఆ చీకటి రాత్రిలో రైలు ప్రతి స్టేషనులోనూ ఆగుతూ పోతూవుంది. రామమూర్తి రెండవతరగతి పెట్టెలో కూర్చున్నాడు. ప్రతిస్టేషనూ పరకాయించి చూస్తున్నాడు. ఉద్యోగము వదలి చాల రోజులయింది. జీవితంలో నిరాశకు చోటివ్వకుండా నెట్టుకుపోతున్నాడు. గొప్ప వ్యాపారి. అయినప్పటికీ రెండవ పెళ్లివిషయం తలపెట్టడంలేదు. ఇరవై సంవత్సరాలముందు యాత్ర చేస్తున్నాడు. ఈరోజు వ్యాపారం చాలించి డబ్బుతో తిరిగి కలకత్తానుంచి ఇంటికి వస్తున్నాడు. చాలా అలసిపోయాడు. ఒక చిన్న స్టేషనులో తటపటాయించుకొంటూ లేచి కూర్చున్నాడు. కిటికీగుండా బైట చూశాడు. ఆ చీకటి రాత్రిలో బైటకూలీ లెవరూ లేరు. స్వయంగా పరుపూ, బ్యాగు దించుకున్నాడు, అటూ ఇటూ చూచాడు. రైలుకదిలి వెళ్లిపోయింది. స్టేషను కంతటికీ వెలుతురుగా వున్న ఒక్కదీపం ఆరిపోయింది. ప్రక్కనున్న బెంచీమీద కూర్చున్నరామమూర్తి కన్ను పొడుచుకోడానికి కూడా కన్పించని ఆ చీకటిలో ప్లాటుఫారం దిగి రైలుపట్టాలు పట్టిపోతున్నాడు. నూరు నూటపది అంగలు వేసి ఆగిపోయాడు. ఆలోచించి కూర్చున్నాడు. ఇనుపపట్టాల క్రిందున్న కడ్డీస్లీపర్లను చేత్తోతడుముతున్నాడు. చుట్టూతడిమాడు. ఇరవై సంవత్సరాల్లో ఎన్నిస్లీపర్లు మారివుంటాయో, చేతికి జిడ్డు పదార్థం తగిలింది. ఇది తప్పకుండా ఇరవై సంవత్సరాల నాటి పాతరక్తమే అనుకొన్నాడు. అవి రక్తపు మరకలా లేక ఇంజను నూనె మరకలా? నలువైపులా చూచాడు. సకలదృశ్యాలు కంటే మనసాన్నిత్యమే ఎక్కువగావుంది. ఔను ఆ స్థళం ఇదే. మోకాళ్లమీదుగ కూర్చున్నాడు, కళ్లుమూసుకున్నాడు. పాత దృశ్యం.

ఇరవైసంవత్సరాల ముందు —

ఉక్కిరిబిక్కిరిగా నిండినరైల్లో భార్యతో పాటు యాత్రచేస్తున్నాడు. రామమూర్తి ఇంతవరకూ ఏమాలోచిస్తున్నాడో ఏమో, రైలుకదిలిందనగానే - ఇంతవరకూ ఊపిరి సల్పడానికి వీలులేకుండావున్న ఉక్కమీద, ప్రక్కన్నే చమటతో గుడ్డలన్నీ తడిసిపోయి వాసన కొడుతున్న ఓ పల్లెటూరి మనిషి మీదా, ఎదురుగా కూర్చొని కిటికీగుండా బైటవైపే చూస్తూవున్న భార్యమీద చెప్పరానంత కోపమూ అసహ్యమూ వేసింది. ఎంతసేపుచూచినా భార్య కిటికీవైపే చూస్తూవుంది. ఒక్కసారయినా తనవైపు చూచిందికాని నవ్విందికానీ కాదు. నిబ్బరించుకోలేనంత ఈర్ష్య భార్యమీద పుట్టింది. ఇదేమీ కొత్త ఈర్ష్యకాదు - పాత ఈర్ష్యే.

రామమూర్తి పెళ్లయి రెండుసంవత్సరాలైంది. రెండేళ్లలోనే పెళ్లినాటిక్రొత్తదనం పాతబడిపోతుందంటే ఆశ్చర్యమేముంది? తరువాత గృహస్థజీవితం పెళ్లినాటిక్రొత్తదనమనే దానిమీద కాకుండా ఇతరవిషయాలమీద ఆధారపడినడుస్తూ వుంటుంది. భార్యాభర్తల ఒకే విధమయిన అభిప్రాయాలమీద, మాతృత్వ పితృత్వ భావాలమీద, చేతోడు వాతోడుగా కలిసిమెలసి పనిచేసిన కాలస్మృతి పధంమీద, పునాది నిర్మించుకొని గృహస్థజీవితం నిలబడివుంటుంది. రామమూర్తి జీవితానికి వీటిలో దేనిమీద ఆధారపడి నిలబడే ఆస్కారం లేకపోయింది. ఇంకా సంతానంలేదు. అర్థం దాంపత్య జీవితంలోని మమత తగ్గిపోయింది. క్రొత్తగా కాపురానికి వచ్చినప్పుడు "నా జీవిత భారాన్ని నీమీదవదలి నిశ్చింతగావుండిపోతున్నాను. ఏకాకిగా నా జీవితం గడపటం దుర్భరం, నీ వెంటవుంటే హాయిగా కాలం గడిపేస్తాను; నాకాధైర్యముంది," అన్నాడు. ఇందుమతి ఎటువైపో మొహంతిప్పి నిశ్చలంగా వింటూ వుందేకాని ప్రత్యుత్తరంగా, 'ఆ, అనిగాని ఊ,' అని అనిందికాదు. తను కోరినట్టుగా జవాబు ఇందుమతి నుండి లభిస్తుందని ఆశించిన రామమూర్తి మనసు మాడిపోయింది. దెబ్బతిని యుద్ధభూమిని విడిచి పరువెత్తేసైనికుడుగా అయిపోయాడు. మెల్లగా తన గదిలోకి వెళ్లాడు. ఆనాటి నుండీ ఇందుమతంటే ఒక రాతిబొమ్మ అనుకొన్నాడు. హృదయంలేని స్త్రీలతో వ్యవహరించడం చాలాకష్టమనుకొన్నాడు. ఈ రెండేళ్లలోగా ఒక్కనాడు కూడా గౌరవ సూచక వాక్కు రామమూర్తి నోట ఇందుమతి వినిన పాపానపోలేదు.

రెండేళ్ల తరువాత యాత్ర తలపెట్టాడు. ఇందునుగురించేమైనా, ఇందుమతి ఉత్సాహం చూపుతుందనుకొన్నాడు అలాంటిదేమీ జరగలేదు. విగ్రహంలా వెంటవస్తూవుంది.

బండి ఆగింది. ఇందుమతి కిటికీవైపే చూస్తూవుంది. 'నాకు దాహమేస్తూవుంది' ఈమాట రామమూర్తికి పరమ అసహ్యంగా వినబడింది. అందులో ఏమాత్రమూ అవసరమున్నట్టుగాని, పట్టుదల యున్నట్లుగాని, లేదు. 'నీళ్లు లేకపోయినా కాలంగడిచిపోతుంది' అన్నట్లుంది. గొంతు దాకా వచ్చిన ఏదో ఓ మాట లోపలనే మ్రింగుతూ రామమూర్తి చెంబుతో పెట్టెదిగి వెళ్లాడు. "నాకుదాహమేస్తూవుంది నీళ్లు పట్టుకరండి" అంటే పోయిందేమి. సాధ్యమయినంతవరకూ ఆమెకు కావలసినవన్నీ చేస్తున్నానే, ఒంటరిగా యాత్రచేయలేక ఈమెవెంట తీసుకవచ్చినా, ఆమాత్రం అర్థం చేసుకోలేని మనిషి _ సరిగా మాట్లాడితే నోటిముత్యాలు రాలిపోతాయా? "చదువుకొన్న భర్తకు రెండు పూటలు పొట్టనిండా రుచిగా వండి పెట్టడమే కాకుండా ఇంకా ఎన్నోపనులు చేసి పెట్టాల్సి వుంటుందనీ, భర్తకూడా రెండుపూటలు తిండేకాకుండా ఇంకా ఏదో

కోర్తాడనీ, అర్థం చేసుకోలేని పల్లెటూరి గబ్బిలాయలతో పడడం మహాకష్టం'' అని గొణుక్కుంటూ పైపువద్దకెళ్లాడు.

బండి కూసిందే తడవు బయల్దేరింది. రామమూర్తి నీటి పంపువద్ద ధక్కా మక్కీ నుండి బయటపడేలోగానే పచ్చజెండా ఆడి ముడుచుకుంది. తనుకూర్చున్న పెట్టె అందుకోలేకపోయాడు. ఇందుమతి కిటికీగుండా బయటచూస్తూవుంది. మతిపోయినట్టయింది.

బండివేగ మెక్కువయింది. ఆమె ఆవేదన ఎక్కువైంది. ఆమె హృదయం సుడిగుండంలో పడిన నావ అయిపోయింది. చెంబు చేతిలో పట్టుకొని రామమూర్తి పరువెత్తుతున్నాడు. ఒకవాకిలిదగ్గర ఇనుపచువ్వ పట్టుకొన్నాడు. ఎక్కడం సాధ్యం కాకపోయింది. ఇందుమతి చూస్తూనే వుంది. క్షణం పాటు ఒకదృశ్యం ఆమె కళ్లముందు నడిచి వెళ్లింది. తొట్రుపడుతున్న రామమూర్తి కాళ్లవేగం .... ఇంత వేగంగా పోతున్న రైలులో ఎక్కబోయి ... ఆమె సహించుకోలేక పోయింది. నీళ్లు ఎందుకు కావాలంటినా ననుకొంటూ తన్ను తాను దూషించుకొంటూ, ఎంతవరకూ వంగగలిగిందో వంగి కిటికీబైట చూస్తూవుంది. మరీ వంగింది. మరీ ... మరీ అంతే ఒకకాలు ఒకభుజంలో భీషణమైన అగ్ని జొనిపినట్టయింది. కళ్లు మబ్బుకప్పినయి. కళ్లు తెరచినా అంధకారంగానే కన్పడింది.

రైలు చీదరించుకొంటూ ఆగిపోయింది. అనుభూతుల్తో నింప బడిన క్షుద్రచేతన ప్రపంచంలోని ఈచిన్ని ఘట్టానికీ ఏమయినా విలువయుంటుందా?

రామమూర్తి పెట్టెవద్దకొచ్చాడు. ఇందుమతిలేదు. రైలులోని జనమంతా ఒకచోట ప్రోగయ్యారు. ఇందుమతి విషయమే మరచి రామమూర్తి ఏమిటో కనుగొందామని అక్కడి కెళ్లాడు. స్థంభించి పోయాడు. రైలుచక్రాలు ఒక కాలు ఒక భుజం మీదుగా వెళ్లాయి. ఒకకన్ను లొట్టపోయింది; శరీరంలో మరెచ్చటా గాయాలు లేవు. వెంట్రుకలన్నీ తడిసి ముద్దయిపోయాయి. ఇందుమతి స్థితిచూచి రామమూర్తి శరీరం 'శిల' అయిపోయింది. కొంతచలించి ఒకకన్ను కొంత తెరువబడింది. ఎవరివైపు చూడకుంటా స్థిరంగా క్షీణ స్వరంతో ''నే వెళుతున్నా'' అనింది. ఎవరి అనుమతినో అర్థించింది. తనకేమీ కాబట్టనట్టు రైలు వెళ్లిపోయింది. డాక్టరు వచ్చాడు. ఒకసారి ఆమెశరీరంవైపు మరో సారి రామమూర్తివైపు చూచాడు. మరో పర్యాయం తెరచియుంచబడిన ఆకన్నువైపు చూచాడు. రక్తసిక్తమయిన ఆమె పమిట తోనే ఆమె మొహం కప్పి వెళ్ళాడు.

రైలు ఆగి కదిలిపోయింది. దయా దాక్షిణ్యాలులేని 'కాలం' రెప్పపాటయినా ఆగింది కాదు. రైలు మానవ నిర్మాణం-మానవుడు

దయాపరుడు. 'కాలం' మానవాతీతం మానవాతీత శక్తి ఎప్పుడూ నిర్దాక్షిణ్యంగానే వుంటుందేమో!

◆ ◆ ◆

ఈనాడు - రామమూర్తి తన్ను తాను ఒక ప్రేతానికి అప్ప చెప్పాడు. జీవితమంతా ఆ ప్రేతం స్వాధీనంలో వుండిపోవాలను కొన్నాడు. కఠోర ఏకాగ్రతతో పాత దృశ్యాల్ని మననం చేస్తున్నాడు. కొంత దూరంలో ఏదో ఏడ్పు, స్త్రీకంఠస్వరం. జడిసి కూర్చున్నాడు. ఏమీ కన్పించడము లేదు శబ్దం వస్తున్నవైపు నడిచి వెళ్ళాడు. చేతులు ముందుకు చాచి వున్నాయి. ఇందుమతి ఎప్పుడైనా ఏడ్చిందా? ఏడ్చివుంటే ఆ ఏడ్పు తనకు జ్ఞాపకముండేది. ఎవరిదా ఏడ్పు!

"ఎవరక్కడ" అన్నాడు. జవాబు లేదు.

"ఎవరా ఏడుస్తున్నది" అని మెత్తదనంగా అన్నాడు. పట్టాల దగ్గరగా ఒక నల్లని మబ్బు లేచింది. తటాలున మరోవైపుకు వెళ్లిపోయింది. చెట్టుదాపున మాయమయింది. మబ్బు లేచినచోటుకు వెళ్ళాడు. చీకట్లో తారాడుతూ కూర్చున్నాడు. ఏదో మెత్తని పదార్థం చేతికి దొరికింది. గుడ్డల మూటలో నుంచీ కెవ్వన కేక. తడబడుతున్న చేతుల్తో మూట విప్పాడు, రక్తపుముద్ద. తడియారని శిశువు ఆపాళంగా కౌగలించుకొన్నాడు. త్వరత్వరగా స్టేషనువైపు వచ్చేశాడు. బెంచీమీద కూర్చున్నాడు. తూర్పుదిశ పటమెగిరింది. దగ్గరి పల్లెలో కోడికూసింది. ఓవర్‌కోటుతీసి తొడుక్కొన్నాడు. అందులో బిడ్డనుదాచి పెట్టుకొన్నాడు.

రామమూర్తి వ్యాపారం మానేశాడు. పెద్దభవనంలో కాపురం. బాలికపేరు 'ఇందుకళ' దాసి ఆడిస్తూవుంటుంది. రామమూర్తి వరండాలో ఈజీచేరులో కూర్చొని బిడ్డవైపు చూస్తూ ఏదో ఆలోచిస్తూ వుంటాడు.

గ్రామస్తులంతా రామమూర్తి పిచ్చివాడంటారు. డబ్బు ఎక్కువగా యున్న వాళ్లుకూడా పిచ్చివాళ్లయి పోతారేమో అనే గుసగుసలు బయలుదేరినయి. 'ఇందుకళ' ఎక్కడ ఆడుకొంటున్నా 'అదో ఆపిచ్చి ముసలాడి కూతురు' అంటూ వేలుపెట్టి చూపిస్తూవుంటారు. ఇందులో చాలా వ్యంగ్యముందని రామమూర్తికి తెలుసు. ఎవరి పాపభారాన్నో రామమూర్తి మోస్తున్నాడని వూరివారందరూ అనుకొంటున్నారు. రామమూర్తి నిర్ద్వంది - హృదయంలో విశ్వాసముంది. క్షమాశీల ఇందుమతే స్వయంగా తన ప్రతిబింబాన్ని రామమూర్తి చేతుల్లో పెట్టిపోయింది. ఆబొమ్మ ఇందుమతి బ్రతికుండగా బహుకరించడానికి శక్తిలేక చచ్చిన తరువాత తన ప్రేమ కానుక సమర్పించుకొంది - భర్తవల్లతనూ పొందింది.

# సౌందర్య శోభ



పండిత డి.గోపాలాచార్యులవారి

# జీవామృతం

కన్నులపండువైన సూర్యాస్తమయం, చల్లని సముద్రపు గాలి, వచ్చిపోయే నౌకలతోకూడిన ఆకర్షణీయమగు చక్కని సముద్రతీరం, ప్రక్కన ప్రేయసి! ఇవి ఎంత ఆనందాన్ని కలిగిస్తాయి! ఈ ఆనందానుభవానికి ఆవశ్యకమైన దేహారోగ్యమును, ఉత్సాహమును ప్రసాదించగల "జీవామృతం" సాటిలేని అద్భుత బలవర్ధక ఔషధం.




## ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్

మద్రాసు 17.

8-వ పేజి జూడుడు)

Arabs P 86-817) అతని కవిత్వం ఆమోఘ్తరుగా ఉంటుంది.

అరేబియా వాఙ్మయంలో హాతిం పేరు చాల ప్రచారంలో ఉంది. పరిష్యా వాఙ్మయంలో కిస్సా ఇహాతింతాయి అనే జనతా గ్రంధంలో (Popular book) నాయకుడితడే! హాఫ్ట్ ఇన్సాఫ్ ఇహాతింతాయి అనే గ్రంధమూ అతన్ని గురించే! అతన్ని గురించి పుస్తకాలు టర్కీ, ఇంగ్లీషు, హిందుస్థానీ భాషలలో ఉన్నాయి (The encyclopedia of Islam).

హాతిం జీవితం పరమాద్భుతమైనదని తలచిన ప్రజలు అతన్ని గురించి సృష్టించిన కథలలో అభూత కల్పనలను చేర్చడ మొక వింతకాదు. ఇది ఆనాటి ప్రజల మనస్తత్వం అని మాత్రమే గ్రహించాలి. రామాయణంలో రావణుడికి పది తలకాయలనే అసహజ కల్పనలేదా? ఇట్లే హాతింతాయి కథలలో కూడా.

ఈకథలలో చెట్లు, జంతువులు, మనుష్యులలాగు మాట్లాడతాయి. ఇంద్రజాలాన్ని మించిన మహేంద్రజాలం ఉంటుంది. మనిషి అమాంతంగా భూమ్యాకాశాలను దాటి వేస్తాడు; సముద్రాలను ఈదివేస్తాడు. ఇటువంటి చిత్ర విచిత్రకల్పనన్నీ ఉన్నాయి. కాశీ మజిలీకథలు, అరేబియా రాత్రుల కథలు ఇటువంటివేకదా! ఈకథలు బాలబాలికలకు ఆనందాశ్చర్యాలను గొల్పుతూంటాయి. హాతింతాయి కథలను అనుకరిస్తూ తెలుగులో చందమామ పత్రికలో రచించిన, ఐదు ప్రశ్నలు అనే రచనను మీరు చదివే ఉంటారు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)





'నాయిల్లు' చిత్రంలో చిన్నపిల్లల సంక్రాంతి కార్యక్రమం.



# కేసరీ హైస్కూలు విశేషాలు

15-8-52 తేదీన స్కూలు ఆవరణలో స్వాతంత్ర్య దినోత్సవము ఉదయం 9 గంటలకు జరిగినది. ఆ సభకు స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి శ్రీ యన్. శంకర రెడ్డిగారు అధ్యక్షత వహించి పతాక ప్రతిష్ట చేసినారు. హైస్కూలు సంస్థాపకులైన డాక్టరు కే. యన్. కేసరిగారుకూడ చాల వృద్ధులైనప్పటికిని ఆసక్తితో సభకు హాజరై మిక్కిలి సంతోషించి నారు. ప్రధానోపాధ్యాయులు శ్రీ. కే. వెంకట రాజుగారు సభికులకు స్వాగతము చెప్పిరి.

2-9-52 కేసరీ హైస్కూలు సారస్వత సంఘ ప్రారంభోత్సవమున చింతాద్రిపేట సెక్రటరీ, కరస్పాండెంటు అయిన శ్రీ టి. పి. మీనాక్షీ సుందరం పిళ్ళై. M. A. B. L. M. O. L. గారు అధ్యక్షత వహించి ప్రారంభోపన్యాసము జరిపినారు.

29-9-52 చల్లపల్లి హైస్కూలు విద్యార్థులు, ఉపాధ్యాయులుకలసి 80 మందివారి మద్రాసుకు ఎస్కర్షనువచ్చి కేసరీ హైస్కూలులో బసచేసిన సందర్భములో జరిగిన సభయందు కేసరీ హైస్కూలు హెడ్ మాష్టరు శ్రీ కే. వెంకట్రాజుగారు చెన్నపురిలో తెలుగు విద్యాబోధనకు కృషిచేస్తున్న కేసరీ ఎడ్యుకేషన్ సొసైటీకి స్థాపకులైన డాక్టరు కే. యన్. కేసరిగారికి జోహార్లు అర్పిస్తూ చెన్నపురికి రాగల తెలుగునాటి విద్యార్థులకు హైస్కూలులో బసలు ఏర్పాటుచేయగలమని నుడివిరి.

14-10-52 కేసరిహైస్కూలు ఆంధ్ర సాహిత్య సంఘమును ప్రారంభిస్తూ ప్రెసిడెన్సీకాలేజీ తెలుగు ప్రొఫెసరు శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు తెలుగు సాహిత్యమందు అభిరుచి సంపాదించుకో వలయునని విద్యార్థులకు హితబోధచేసిరి. శ్రీ కే. వెంకట్రాజుగారు అధ్యక్షతవహించిరి.

22-10-52 రాయపేట కేసరీహైస్కూలు గ్రౌండ్సులో జరిగిన సిటిజన్‌షిప్ ట్రెయినింగు ప్రదర్శనములలో కేసరీ హైస్కూలు బాలికలు కుమ్మిడాన్సును ప్రదర్శించారు.

23-10-52 సాయంకాలమున శ్రీ నల్లగొండ రామచంద్రరావుగారు 71 ఆసనములు, సూర్యనమస్కారములు ప్రదర్శించారు. ఈ సందర్భంలో పెద్దలు. పిన్నలు చాలమంది పాల్గొన్నారు. కేసరీ ఎడ్యుకేషన్ సొసైటీ ట్రజరరు జస్టిస్ శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు ఈ ప్రదర్శనమునకు అధ్యక్షత వహించినారు.

2-11-52 కేసరి హైస్కూలు బాలురు, ఉపాధ్యాయులు దాదాపు 104 మంది పక్షితీర్థము, మహాబలిపురమునకు విజ్ఞానయాత్రగా వెళ్ళిరి. కేసరీ ఎడ్యుకేషన్ సొసైటీ మెంబరుగారైన శ్రీపతి రామమూర్తిగారు ఆ నాడు ఉదయం ఎస్కర్షన్ పార్టీకి శుభాసీస్సు లొసగిపంపిరి. అచ్చట దృశ్యములు కొన్ని ఫోటోలు తీయబడినవి. ప్రధానోపాధ్యాయులు శ్రీ కే. వెంకటరాజు కృషివలనను పాధ్యాయ బృందముయొక్క ఉత్సాహమువలనను జయప్రదముగా జరిగినది.

22-11-52 టీచింగ్ శిక్షణ పొందుచున్న మెస్టన్ ట్రెయినింగు కాలేజి B. T. విధ్యార్థులు వెలింగ్‌డన్ ట్రెయినింగు కాలేజి B. T. విద్యార్థినులు కేసరీ హైస్కూలులో తమ బోధనాభ్యాస సాంత్యమున, హైస్కూలు ఉపాధ్యాయ బృందమునకు అల్పాహార విందు జరిపినారు. కొందరు వారి లెక్చరర్సుకూడ హాజరయ్యారు. కేసరీ హైస్కూలు హెడ్‌మాష్టరు గారు తమవిధులను మనస్ఫూర్తిగా నిర్వహించవలెనని వారికి హితముపదేశించిరి.

23-11-52 కేసరీ హైస్కూలు విద్యార్థినులు కలసి సుమారు 50 మందిని పక్షితీర్థమునకు, మహాబలిపురమునకు విజ్ఞానయాత్ర సాగించినారు. ఉదయము కేసరీ ఎడ్యుకేషన్ సొసైటీ సెక్రటరీగారైన

శ్రీ బండి శ్రీహరిరావు నాయుడుగారు బాలికలను ఆశీర్వదించి హితోక్తులతో సాగనంపిరి. శ్రీమతి S. జయలక్ష్మిగారి నాయకత్వము క్రింద ఆయాత్ర జయప్రదముగా కొనసాగినది.

16-12-52 ఈ దినము ఆంధ్రరాష్ట్ర సంపాదనకై ఉపవాసదీక్షతో ఆత్మబలిదానము చేసిన శ్రీ పొట్టి శ్రీరాములుగారి మరణమునకై మిక్కిలివగచి కేసరీ హైస్కూలు వెంటనే మూసివేయబడినది. వారి ఆత్మశాంతికై దైవప్రార్థనలు జరుపబడినవి. హైస్కూలు ఉపాధ్యాయులు ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వెంకటరాజుగారు వారి భౌతికదేహమును దర్శించి ఒక పుష్పమాలను అర్పించి తమ సానుభూతిని తెల్పుకొన్నారు.

క్రిస్టమస్ శలవులలో రేపల్లి మాధ్యమిక పాఠశాల విద్యార్థులు, మడకశిర హైస్కూలు విద్యార్థులు ఉపాధ్యాయులతో మదరాసుఎక్స్కర్షనువచ్చి కేసరీ హైస్కూలులో బసచేసిరి. మేనేజిమెంటువారికి ప్రధానోపాధ్యాయుల వసతిఏర్పాటులకు కృతజ్ఞత తెల్పిరి.

# సంపాదకీయములు

## కీ. శే. శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు

పాపం తన తనువు తెల్లవార్చుకొనిపోయి పరలోకంలో సుస్థిరమయిన శాంతి సౌఖ్యాలను అనుభవిస్తున్నాడు. ఈ లోకంలో ఆయన రచనలు, ప్రజాసేవ, స్వాతంత్ర్యసమరంలో ప్రముఖపాత్ర వహించినవి. ఆయన రాజకీయ వ్యాసాలు విశాలభావాలతోటి, అపారనుభవ పూరితంగానుండేవి.

ఆ రోజులలో పోలీసులన్నా, ప్రభుత్వమన్నా గజగజలాడే ప్రజలు శ్రీ సత్యనారాయణగారి 'మాకొద్దు యీ తెల్లదొరతనం' పాటతోట వేలకొలదిమంది స్వాతంత్ర్యసమరంలోకి దూకారు.

ఆయన స్వార్థరహితమయిన సేవ, ప్రజలను ఉత్తేజపరచిన రచనలు స్వాతంత్ర్య ఉద్యమవ్యాప్తికి విశేషంగా నుపకరించినవి. కాని స్వాతంత్ర్యము సిద్ధించినతరువాత ప్రజలు, ప్రభుత్వాలు కూడ యిట్టివారి యెడల చిన్నచూపుచూసినవి. దానిఫలితంగానే వయోవృద్ధుడు కాకపోయినా ఆర్థికదుస్థితిమూలంగా క్రుంగిపోయి తానిక యీలోకంలో నుండలేనంటూ కండ్లుమూశాడు.

ఆయన పరలోకంలో సుస్థిరమయినశాంతి, ఆనందాలననుభవిస్తాడనడంలో సందేహంలేదు. కాని శ్రీ సత్యనారాయణగారివలె దేశసేవకని అఖండత్యాగాలు చేసినవారు యింకా కొంతమది కూటికి గుడ్డకు కరువైనా మానసానికి మగ్గుతున్నారు. వారికి యిప్పుడైనా ప్రజల, ప్రభుత్వాలు సహాయంచేయడం ధర్మం.

## విద్యావిధానంలో మార్పులు.

శ్రీ సర్వేపల్లిరాధాకృష్ణగారు దేశ అవసరాలనుబట్టి ఉన్నత విద్యావిధానంలో మార్పులు రావాలంటున్నారు. ఇది చాల ఉత్తమమయిన సూచన. విద్య వ్యక్తిగతంగా ప్రజలు పొట్టపోసుకోడానికి ఉద్దేశించబడింది మాత్రం కాదు. ప్రజలు తాము అభ్యసించే విద్యను దేశీయపురోభివృద్ధికి వినియోగించకలిగిన నాడే సార్థకమనిపించుకొంటుంది. అంటే స్త్రీలు పురుషులు కూడ దేశ అవసరాలనుబట్టి విద్యావిధానం ఏ ఏ విధంగా రూపొందించబడిన దానిని అభ్యసించవలసినది నిర్ణయము కావాలి. దానిమూలంగా తమ విజ్ఞానాన్ని, సామర్థ్యాన్ని అన్నిరంగాలలోను దేశీయ ఔన్నత్యానికి వినియోగించ అవకాశముంటుంది.




15-1-53 నుండి 14-2-53.

### మేషం :

శుభకార్యాదులకు పిలుపులు, శుభకార్యాచరణంకోసం పడుతూవుండే ఆందోళన కొంత తగ్గిపోతుంది. కార్యానుకూలాలు తప్పవు. పెద్దల స్పర్థ తగ్గుతుంది. మెల్లగాగాని ధనం సమకూడదు. వాతం అధికంకాగల సూచనలున్నవి, ఋణ-శత్రు-రోగ-పీడ తొలగుతుంది. చిన్నాపెద్దల అనుకూలం. నసపెట్టుకోరకాలు తగ్గిపోతారు. ఒకటికి పదం తలంగ ఇన్నాళ్లు స్తంభించిన కార్యాలు యిప్పుడు లాభసాటిగా అనుకూలం చూపుతవి. బంధువులు పెడత్రోవన బడినందునవారిని తప్పించుటకు శ్రమపడక తప్పదు. ఎన్నడు అనుకోనివారలవల్ల ధనం. జయం-లాభం కూడుతుంది. ఆరోగ్యానికేకొరవ వుండదు. స్త్రీ బంధుకలహం.

### వృషభం :

ఒక్క కానీ అయినా వృథాగాకర్చు చెయ్యరు. స్త్రీలు, వృద్ధులు, చిన్నలు, పెద్దలు మీ విషయంలో ఏవో కొన్ని బ్లాకుమార్కులు చూపింపతలపడుతారు. ఎంతో శ్రమతో కొన్ని కార్యాలున్నూ, అతి సులభంగా కొన్ని కార్యాలు నెరవేరుతవి. సింహ్వాప్న స్థితి, గౌరవం అధికం అవుతుంది, శత్రువులపోటీ పోతుంది. విచిత్రవస్తులాభం, గ్లాసుసామానులు పొందుతారు. అమూల్యాభరణవస్తులాభం. బంధుహాని, వాహననష్టం, స్థిరాస్థి - క్షేత్రాదులు - గృహాదుల సంస్కరణం మరల కొనసాగించగల్గుతారు. ఆకస్మికాదృష్టాలు కొన్ని కలవడంవల్ల సర్వసమృద్ధి కల్గుతుంది, ఆరోగ్యం

### మిథునం :

శుభాహ్వానం - ఆత్మబంధువుల ఆహ్వానములు బంధువుల రాకపోకలు - ప్రేమాభిమానాదులవృద్ధి, దైవప్రీతి, భక్తి పెరుగుతుంది. గొప్పవారికి తోడ్పడెదరు. నవీనులతో చుట్టరిక బాంధవ్యభాగస్వామిత్వం శుభకరం, విచిత్రాదులు కొన్ని చేస్తారు. అధిక లాభాలు రాగలవు, అదృష్టం గెల్పించి వేలాదిగా వందలాదిగా సమకూర్చగలదు. తిరుగుటయందు ఆసక్తి. అమూల్యవస్తు సాధనం. నేత్రోష్ణం - ధన సమృద్ధి, చిన్నాపెద్దలవృద్ధి, పదవీలాభం, సౌఖ్యాసక్తి, శుభవార్తలువినుట, సర్వాభివృద్ధి, సన్మానం పండితపోషకత్వం ధర్మహృదయం.

### కటకం :

దొంగల్లాటి పెద్ద మనుష్యులను వదుల్చుకోలేరు, వెంటపోనూలేరు. దుర్బలం పెరిగిపోతున్నా తీరిక వుండదు. పిలుపులు బాగా వుంటవి, పడమటిదేశం వారు మీతో లాభసాటియగుపనుల్లో కలుసుకొంటారు, చిత్రవిచిత్రాలు చూస్తారు. గ్రంథప్రీతి, విద్యావిఘ్నాలు కొంత తగ్గగలవు, వ్యవహారాలు అనుకూలించవు, సహచరులకు ఆరోగ్య విషయంలో లోపం వుంటుంది, శుభకార్యాలకు వెళ్ళితే ఇంట్లో దొంగల దూర యత్నించి విఫలులవుతారు, నిద్ర పట్టదు, అన్యులపై అభిమానంవుంటే అది యశోభంగాన్ని యిస్తుంది, కోపం ఎక్కువ, రాజాశ్రయం-నానార్థసిద్ధి - మిశ్ర ఆదాయం.

### సింహం :

బుద్ధి స్థిమితంగా వుంచుకొని ఏ ప్రయత్నాలు

చేసిన లాభమే, ఆడపార్శ్వపువారు కోపంతో చూస్తారు. చిన్నలతో స్పర్ధం, తనవారు దూరస్థంగా వున్నారనే జిజ్ఞాస కొంత తగ్గుతుంది. ప్రయాణాలు శ్రమకరం. అనుకొనేది ఒకటి, అయ్యేది వొకటి. వ్యవహారాలు కొన్ని వస్తవి, సాక్ష్యం చెప్పమంటారు. మిత్రాహ్వానం, పుణ్యక్షేత్ర సందర్శనం - అమూల్యాదులు కొంటారు. తనవారివల్ల సుఖంగా పనులు నెగ్గించుకోలేకపోతారు, కాస్తలో తారుమారు తబ్బిబ్బులు. అధికంగా మాట్లాడవద్దు. ప్రభుసన్మానం, ఉన్నతి, యశోభివృద్ధి, గొప్పపనులుచేస్తారు. వ్యాపారం నడుస్తుందిబాగా.

## కన్య :

ఇన్నాళ్లు స్తంభించి అధఃపతనంలోపడి వున్నవన్నీ మరల యింజన్లు షెడ్డునుంచి బైటికివచ్చు లాగున రాగలవు నరేంద్రులకు శుభం, ధనవంతులకు ధనాభివృద్ధి, వ్యాపారస్థులకు వ్యాపారోన్నతి, విద్యార్థులకు నిలచిన విద్య మరల కొనసాగుతుంది, రాజకీవి, అధికంగా మాట్లాడడంవల్ల అందరు చిన్నతనంగా మాట్లాడుతారు, కోపం అధికం అవుతుంది, దైవసేవపై అప్రీతి. పూర్వ పరిచితులను చూస్తారు, రైతులవల్లమేలు భూప్రియత్వం, భూలాభం, యిష్టముల సానుకూలం, నిధినిక్షేపలాభం-రాజసన్మానం. వ్యాపార- అనుకూలానికి మీలోటు సవరించుకొంటారు, మంచివి తింటారు.

## తుల :

స్త్రీ లాభం స్త్రీ ధనప్రాప్తి, విరుద్ధాలన్నీ పోతవి, అమోఘాలు సాధించుతారు, శత్రువులు పలచబడుతారు, దాచిపెట్టిన వస్తువులు దక్కుతవి, మనోహర వస్తులాభం, లోకప్రియత్వం, సంతోషవార్తలు. ధనసిద్ధి, స్థూలత్వవృద్ధి, అధికార్ల దారుణత్వ చిహ్నములు అంతరించుతవి, మృగాదులపై అతిప్రియత్వం, శుభవార్తలు, శుభాహ్వానాలకు విందులకు పోతేరు, కలహాలురాగలవు, కొన్నాళ్లు ప్రతివిషయం పరిశీలన ముఖ్యం.

## వృశ్చికం :

బంధువులు ద్రోహంచెయ్య చూస్తారు, ఆదరణం. బంధువులను పరామర్శించుట. ధర్మబుద్ధి, విద్యానిపుణత్వం, కష్టనివారణం, రాజగౌరవం, మిత్రలాభం, బంధువుల వియోగం, అతినిద్ర, పనులబిగు, చిన్నలకరిష్ట నివారణం, ధనపు యిబ్బందులు తీరును, మరల వ్యాపారవృత్తి, ఉద్యోగాదులు పైకి తెస్తుంది, విచిత్రాలు చూస్తారు, ఇతరులు చెప్పినట్లు నడువడం వల్ల తలవని తలంపుగా ఎన్నో అనుకూలాలు కల్గుతవి, అతిగాభోజనం చేయింప చూస్తారు, శిష్యద్రోహం, ఇరుగు పొరుగుల దూరస్థం, ఋణరోగ శత్రుభీతి నివారణం.

## ధనుస్సు :

బహుప్రజానీకందరికి రావడం, శత్రుశరణాగతి, నవీనవస్తు పరికరాలవృద్ధి, వ్యాపారోన్నతి, శ్రీమంతకాలం, అధికార్ల ప్రాపకం, శుభకార్యాలు యీడేరుతవి, సంతృప్తి అన్ని విషయాల్లో తక్కువ, దూరస్థం వాళ్ళకోసం మనోవ్యాకుల నివారణం, ధనవృద్ధి రాజసన్మానం, సభాగౌరవం, మహాత్ములసేవ, ఆరోగ్య ప్రవర్ధనం, జలభీతి, జలదోషం, శాంతిప్రియత్వం, విద్యానిపుణుల సలహావల్ల ఆరోగ్యభాగ్యం, ప్రవర్ధనం, వ్యాపారలాభం, శుభప్కారం.

## మకరం :

అధికార్ల చికాకులు, పెద్దలస్పర్ధ, శ్రీమంతుల అండ, విద్యను అతి ప్రాముఖ్యతకు తెచ్చుకొంటారు, మాట్లాడితేనే కలహాలు రాగలవు, మంగళప్రదం, ధర్మబుద్ధి, బంధుపరోభివృద్ధి, చలనం, చరాస్థిరోవగృద్ధి, దాపరికం అధికమగుట మిత్రలాభం, జ్ఞానసిద్ధి, ప్రయాణాల లాభకారి, గొప్పవార్ల అండ, దైవసహాయం పట్టిందంతా బంగారుమయకాలం, పెద్దసాక్షు ఇంట్లో వుంచుకోరాదు, రాజకోపం వుంటుంది, లెక్కపద్దుల విషయం జాగ్రత్త ముఖ్యం, పరమరహమాస్యాలు యితరులతో చెప్తే దాగదు, పదిమందిలో మీపేరు ప్రాకుతుంది.

### కుంభం :

ధనసిద్ధి, స్తంభించిన కార్యములు మరల పూర్తిగా కొనసాగింపబడుతవి, క్రొత్తవి సమకూడుతవి, అధికార్ల ఆదరణం. రత్నాభరణప్రవర్ధనం. రాజకీవి. గర్వాభివృద్ధి, అలంకారప్రియత్వం, దిగుళ్లన్నిపోతవి. బంధువుల ఆదరణం తిరుగుటవల్ల కానివికాగలవు. మిత్రసహాయం, అద్భుతాలు చేస్తారు. భూఆదాయం నిధినిక్షేపలాభం, పెద్దకలహాలు, అనుకూలంఅవుతవి. పోలీసులవల్ల, రాజులవల్ల ధనప్రదం. స్త్రీబంధువుల వల్ల ఆదరణం, మాతాపిత బంధుమిత్రులవల్ల అధికంగా ధనం సమకూడి పనులుచక్కబడుతవి. గృహనిర్మాణం మంచిది చేస్తుంది. గొప్ప అండకల్గును.

### మీనం

పర్వతారోహణంవల్ల కార్యములు మరలకొనసాగుతవి. శుభం చూస్తారు. గొప్పవిచేస్తారు. భయనివారణం, భోగభాగ్యభివృద్ధి, పాతబాకీలు రాగలవు, అధికాదాయం కల్గుతుంది వృత్తివ్యాపార వుద్యోగాదుల్లో విశేషలాభం కల్గుతుంది. శ్రమనివారణం. సన్మానాలు పొందుతారు. శుభకార్యాదులకై ప్రశంస కుటుంబప్రవర్ధనం. విద్యాభివృద్ధి దొరల అండ. మిత్రబంధు దర్శనం భూ అంతర్గత ధనం రాగలసూచనలున్నవి. స్త్రీల ఆరోగ్యం కొద్ది శ్రమతో అనుకూలం అవుతుంది. నిరాదరణ చేయ చూడదలంచిన శత్రువులు క్షీణతకువస్తారు. రాజకీయంలో అనుకూలురకు హాని బంధునష్టం, వికాసంకల్గుతుంది.

త్రికాలవేది, జ్యోతిశ్చక్రవర్తి, మంత్రమూర్తి, ప్రొఫెసర్ కె. అంజి.



'నాయిల్లు' చిత్రంలో పిల్లలతోకూడ నాగయ్య

## నందననామ సం॥ర మాఘ ఫాల్గుణ మాసములు

| నెల | తేదీ | వారం | వివరాలు |
|---|---|---|---|
| జనవరి నెల 1953 సం॥ | 16 | శు | శుపా 30.13 ఉషా 9.40 త్యా 3.45 మాఘస్నానం |
| | 17 | శ | వి 24.20 శ్ర 5.44 త్యా 3.43 |
| | 18 | ఆ | త 15.5 ధ 1.18 తిథి ద్వయం |
| | 19 | సో | చ 11.46 పూభా 52.6 |
| | 20 | మం | పం 5.43 ఏవ్యం 54.3 ఉభా 43.58 |
| | 21 | బు | స 54.39 రే 44.30 త్యా 3.47 రథసప్తమి |
| | 22 | గు | అ 50.35 అశ్వ 41.53 భీష్మాష్టమి |
| | 23 | శు | న 47.33 భ 40.18 త్యా 3.54 |
| | 24 | శ | ద 45.44 కృ 39.53 త్యా 3.59 |
| | 25 | ఆ | ఏ 45.11 రో 40 40 భీష్మైకాదశి |
| | 26 | సో | ద్వా 45.53 మృ 42.41 త్యాజ్యాభావః భీష్మద్వాదశి |
| | 27 | మం | త్ర 47.46 ఆర్ద్ర 45.51 |
| | 28 | బు | చ 50.41 పున 50.0 త్యా 4.17. |
| | 29 | గు | పౌ 54.29 పుష్యమి చంద్రగ్రహణం, అమృత సిద్ధియోగం |
| | 30 | శు | బపా 58.56 ఆశ్రే 60.10 |
| | 31 | శ | వి 60.10 ఆశ్రే 0.43 త్యా 4.24 |
| ఫిబ్రవరి నెల 1953 సం॥ | 1 | ఆ | వి 3.49 మఘ 6.41 భానువిదియ |
| | 2 | సో | త 8.39 పూఫ 12.39 |
| | 3 | మం | చ 13.22 ఉఫ 18.31 త్యా 4.22 |
| | 4 | బు | పం 17.31 హ 23.50 త్యా 4.19 |
| | 5 | గు | ష 20.59 చి 28.28 శూన్యతిథి. |
| | 6 | శు | స 23.29 స్వా 32.11 |
| | 7 | శ | అ 24.53 విశా 34.47 |
| | 8 | ఆ | న 25.3 అనూ 36.14 త్యా 4.1 |
| | 9 | సో | ద 23.57 జ్యే 36.25 త్యా 3.56 అమృతయోగం |
| | 10 | మం | ఏ 21.32 మూ 35.24 తిథిద్వయం |
| | 11 | బు | ద్వా 18.6 పూషా 33.16 |
| | 12 | గు | త్ర 13.35 ఉషా 30.10 మహాశివరాత్రి |
| | 13 | శు | చ 8.15 శ్ర 26.20 ద్వాపరయుగాదిః |
| | 14 | శ | ● అమా 2.19 ఏ వ్యం 53.43 ధ 22.0 |
| | | | ఫాల్గుణమాసం |
| | 15 | ఆ | శు వి 49.35 శత 17.26 త్యా 3.42 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# ఈ నెలలో విడుదల




చిత్రప్రియా
రిలీజ్

డైరెక్షన్... చిత్రపు నారాయణమూర్తి బి.ఎ.

జి. వరలక్ష్మి, సూర్యకళ, అనసూయ, కోటిరత్నం, బలిజేపల్లి, అమర్‌నాథ్, రామశర్మ, చలం, పండితరావు, గణపతిభట్...

స్టూడియో... రేవతి

KRISHNA

Lodhra Press, Madras-14.